ఓం

శ్రీ సద్గురుభ్యోనమః



# పరమ తత్త్వాతీత బోధిని.

ఇయ్యది

గంజాం జిల్లా, బరంపురం నివాసుఁడు

శ్రీ తారక బ్రహ్మానుభవియగు,

పూసిపెద్ది - సాంబశివరావుగారిచే

రచియింపఁబడినది.

చెన్నపట్టణము

ప్రాతచాకలపేటయందుండు.

పమ్మి - త్యాగరాయసెట్టిగారి

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

౧౯౧౮ సం.

 — (వెల 2 అణాలు.

# సంస్కృతాంధ్రగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు టీకానుక్రమణికా | ౦ | ౧౨ | ౦ |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ౧ | ౦ | ౦ |
| సుమతిశతకము, సటీక | ౦ | ౨ | ౦ |
| గజేంద్రమోక్షము, సటీక, మంచికాగితములు | ౧ | ౬ | ౦ |
| రుక్మిణీకల్యాణము, సటీక చక్కనిప్రింతి | ౦ | ౬ | ౦ |
| స్తోత్రరత్నపంచకము. | ౦ | ౮ | ౦ |
| రుద్రకోటిమహాత్మ్యము. | ౦ | ౪ | ౦ |
| ఆంధ్రరుద్రభాష్యము, నమకము చమకము అనంబడు రెండుప్రశ్నములు, సస్వరముగా ప్రతి మంత్రమునకును తెనుఁగు ప్రతిపదటీకాతాత్పర్య పురశ్చర్యా ప్రయోగ వివరణములతో ముద్రింపఁబడినది. | ౧ | ౪ | ౦ |
| శూద్రకమలాకరము, శూద్రధర్మసంగ్రహము, తెనుఁగు తర్జుమా. | ౧ | ౮ | ౦ |
| అవధూతగీత. ఇది మూలమును దానికి సరైనటీకయు తాత్పర్యమును గల్గి అపరోక్షజ్ఞానమంతయు విస్తరముగా బోధించుచున్నది. | ౧ | ౦ | ౦ |
| అర్థపంచకము. | ౦ | ౨ | ౦ |
| విష్ణుపురాణము పద్యమునకు టీక. | ౧ | ౧౨ | ౦ |
| వేదాంతరత్నాకరము. | ౦ | ౮ | ౦ |
| శేషధర్మము వచనకావ్యము. | ౦ | ౧౦ | ౦ |
| కాళహస్తిమాహాత్మ్యము వచనము. | ౦ | ౪ | ౦ |
| భక్తలీలామృతము ౬౩ శివభక్తుల చరిత్రములుగలవి. | ౧ | ౦ | ౦ |
| మణిత్రయి తాత్పర్య సహితము. | ౦ | ౬ | ౦ |
| అచలగీతరత్నావళి ౨౬౦ పద్యములు. | ౦ | ౩ | ౦ |
| శ్రీమద్రామాయణ సారసంగ్రహము తాత్పర్యసహితము. | ౦ | ౮ | ౦ |

---

పమ్మి - త్యాగరాయసెట్టి. ప్రాతచాకలపేట, చెన్నపట్టణము.



ఓం

శ్రీ సద్గురుభ్యోనమః.



# పరమ తత్త్వాతీత బోధిని.



శ్లో॥ భజే విశేషసుందరం సమస్తపాపఖండనం ।
స్వభక్తచిత్తరంజనం సదైవ రామమద్వయం ॥
శ్లో॥ నిజస్వరూపబోధకం కృపాకరం భవాపహం ।
సమం శివం నిరంజనం భజేహ రామమద్వయం ।
శ్లో॥ సదా ప్రపంచకల్పితం హ్యనామరూపవాస్తవం ।
నిరాకృతిం నిరామయం భజేహ రామమద్వయం ।
శ్లో॥ నిష్ప్రపంచనిర్వికల్పనిర్మలం నిరామయం ।
చిదేకరూపసంతతం భజేహ రామమద్వయం ॥

—(*) కథాక్రమం బెట్టిడనఁగా. (*)—

తే॥ ఎఱుక మఱుపులు గానిది యెఱుఁగలేరు ।
పరమపరిపూర్ణ సుఖమూని బట్టలేరు ।
ఉరము చెదరని గుఱిని యుండలేరు ।
విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥

అనఁగా, నీలోకంబున నెఱుక మఱుపులుగల మనస్సు చెదరకుండ నుండినచో పరమ తత్త్వాతీతమగు పరిపూర్ణ సుఖము నిచ్చును. అట్టి పూర్ణసుఖమును వదలుకొని యల్పసుఖములనుఁ గోరుచుందురు. అశుద్ధమైన మనస్సెల్లప్పుడును నీచపు వృత్తులలో సంచరించుటకు నిష్టపడును. తే॥ ఎండమావులచాడ్పగు నీజగంబు । లుండు

పరమాత్మ యందున దండిగాను । నిండుమదిలోన శోధించి నెగడవలెను॥ వి॥ అను రీతిగా, నెండమావుల చాడ్పుగ నీ జగము లుండు పరమాత్మయందున దండిగాను యనఁగా, మరుమరీచకలయందు నీళ్లు లేనిదే నీళ్లున్నట్లుగా భ్రమ గలిగుండునట్లు బట్టబయలందు నీ ప్రపంచ మెంతమాత్రమును లేనిదే యున్నట్లగఁబడుచున్నది. కావున, మనస్ఫూర్తిగ నా సంగతి తెలిసికొనవలయును. అనఁగా, నీ జగత్తు మిథ్యయైనది, బ్రహ్మంబు సత్యమైనది. శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః । బ్రహ్మసత్యం జగన్మిథ్య జీవో బ్రహ్మైవనా పరః॥ అని నీతి శతకము నందున్నది. అందుకు శ్రుతి ప్రమాణములున్నవి. ఏమనిన, "సర్వం ఖల్విదం బ్రహ్మ నేహానానాస్తి కించన" "బ్రహ్మమాత్ర మసన్నహి" "నేహానా నాస్తికించన" "సదేవ సౌమ్య ఇదమగ్రాసీత్" "సృష్టేఃపురా నామరూప వివర్జితం" అనునవి యున్నది. అనఁగా విటికర్థం బేమన, నొక్క బ్రహ్మము తప్ప మఱేమియు లేనేలేదు. తక్కినదంతయు మృషా అంటే? తక్కినదంతయు నబద్ధము. అనఁగా, నుత్తది నీళ్లు లేనిదే నీళ్లున్నట్లు ప్రపంచము బ్రహ్మమందు లేనిదే ప్రపంచమున్నట్లు భ్రమ గలుగుచుండును. అంతేగాని, నిజమరసినచో నేమియు లేనిదే సుమండీ? యీ సంగతే శ్రీ మహాయోగపురుషుఁడగు శ్రీ వేమనార్యుని స్వానుభవనీయము. ఓ చదువరులారా! బ్రహ్మవిద్యయనఁగా నేమో మీకు దెలిసి యున్నదా? శ్రవణముఁ జేయుము. తే॥ సర్వకుల ధర్మమర్మముల్ సంతరించి । సకల యోగంబులనుమించి సమ్మతముగ । బట్టబయలందుఁ జేరుటే బ్రహ్మవిద్య॥ వి॥ దీని భావమేమన, నీ బట్టబయలు సర్వంబునకు నిర్విశేషస్వరూపంబు నిరీహము, నిరాశ్రయము, నిష్ప్రితిమ అన్నింటికిని మిగిలిపోయినదేదో యదే బట్టబయలు అది సకల ప్రదేశములయందును, సకలావస్థలయందును, సకల లోకంబులయందును, నిండి నిబిడీకృతమైయుండు అదే పరమతత్త్వ

తీతము, అదే నిష్ప్రతియోగిక బ్రహ్మంబు. దీనికి మించినది మఱి లేదు సుమా? యిదే శ్రీతారక బ్రహ్మానుభవిగారిది. అయితే నందుకొక పద్యము వ్రాయఁబడుచున్నది. తే॥ నిరతమాత్మ చిదానంద నిలయమందు। నరవితోడంత పరిపూర్ణ సౌఖ్యమొఱఁగి। యఱదియగు బయల్ పేరుట మనుభవంబు। విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ అని యున్నది. ఇదిగో! నీ యనుభవమే వేమనార్యునిది. ఇదే సకలమైన మహానుభావులయొక్క పరిపూర్ణానుభవము యింతకన్న యీ త్రిలోకములయందును వేరే లేదు. మఱియును. తే॥ నిర్మల జ్ఞాన పరిపూర్ణ నిష్ఠయందు। నిర్మ సన్న్యాసయోగియై నిసిమసంగి। మర్మ మెఱుఁగుచుండుటే మౌనమయ్యా। విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ అనియున్నది. ఈ లోకంబున నిజమనునదే మాట్లాడక నూరకొన్నంత మాత్రమున మౌని యగునా? ముని మననముఁ జేయువాఁడని భావము సుమా? తన నిజము తా నెఱుఁగనదే మన స్సూరకయే నిలువనియ్యదు సుమా? చెదపురుగువలె హృదయము కోరివేయుచుండును. కొందరు తెలియని దొంగవేదాంతులు భోజనముఁ జేసినప్పుడు మాత్రము మాటలాడమని వ్రతము బట్టెదరు. మఱికొందఱు యెల్లప్పుడును మాటలాడనే మాటలాడరు. అయితే నందువలన నొకటి లాభమున్నది. జగడ ముండదుగాని, మనస్సు మహా ప్రలాపముగా నుండును. యిదే లాభముగాని, మఱేమియు లేదు. మౌనత్రయము లున్నవి. అక్షిమౌనమనిన్ని, కాష్ఠమౌనమనిన్ని, మఱియొక మౌనమున్నది. అది జ్ఞాపకములోనికి రావడము లేదు. అయితే నేమి సరే; వృథా మాట్లాడకనుంటే మౌనివర్యుఁడగునా? బ్రహ్మానుభవమును మననముఁ జేయువాఁడే మౌనివర్యుఁడు సుమా? ఆ మౌనమే నిర్వాసనము. అనఁగా, వాసనత్రయము లుండగూడదు. వాసనత్రయములనఁగా, 1. లోకవాసన, 2. దేహవాసన, 3. శాస్త్రవాసన యివియే వాసనత్రయములని పేరు. అం

దులో వాసన యనఁగా, పూర్వము తాననుభవించినవి జ్ఞప్తికి వచ్చుట. అందులో శ్రుతి;— శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధేశ్చలన కారణం । ఉపదేశా ద్ధరేర్బుద్ధ్వా రమతే సర్వకర్మసు॥ అని యున్నది. దీని తాత్పర్యమేమన, శాస్త్రజ్ఞానము బహుశ్రమను మరింతబుద్ధి చలింపఁ జేయును. కావున, నుపదేశమునొంది సకల కర్మలయందు సంచరించిన నేమి ఫర్వాలేదుగా? ఉప + దేశము— ఉపదేశము. అనఁగా, సుస్థిరమైన యచల బ్రహ్మాంబునందు వర్తింపఁ జేయుటే నుపదేశమనఁబడును. "ఉప" యనఁగా, సమీపము, దేశము. యనఁగా, చోటని దగ్గరచో యేది యనఁగా, నాత్మారాముఁడు. యీ మనస్సు యజ్ఞానులకందఱకును క్రిందుగా నుల్టాసీదాగా గమనించుచుండును. జ్ఞానులకు మీఁదువైపున గమనించుచుండును. ఏమిటి? మనస్సునే కుండలిశక్తియని పేరు. అనఁగా పాముని భావము. ఆ కుండలిశక్తియే వుల్టాసీదాగాను, సీదా వుల్టాగా సంచరించుచుండును. ఓరీ నీమనస్సు ఫలానిలాగున క్రిందితట్టు పాఱుచుండు మనస్సును మీఁదివైపుకు ద్రిప్పుమని చెప్పెదరు. మఱియు నందుకు క్రియాభాగము.

దృష్టి, క॥ భ్రూమధ్య దేశమునఁగను ।
నేమాఱక చూడఁజూడ నిర్గుణమగునా ।
నేమము మదిలో నెంచఁగ ।
సామీప్య నందమొదవు సరగున వేమా॥

మఱియును, క॥ భృకుటీ మధ్యస్థితఘన ।
ప్రకటన ద్విదళాబ్జ శిఖరి ప్రభవద్వ్యా ।
న్నికటను దేహజగత్రయ ।
వికసిత రూపపరితాప వీరుఁడు వేమా॥

క॥ భయమేమియు లేదు మదిలో ।
జయపథమగు పూర్ణమంది చంద్రిక వెలియా।

బయలంది పొందినిండిన।
అయనంబగు నాత్మపదవి యందును వేమా॥

మీఁదను వ్రాయఁబడినది యభ్యాస యోగములోనివి.

ఓ చదువరులారా! వింటిరా! ఏమనిన, క॥ దలఁచినను శూన్యతత్త్వము। దలఁచకుం డినను శూన్య తత్త్వంబదియా। తలఁచిన తలపీ డేరును। దలఁచక నుండినను దానె తత్త్వము వేమా॥ అనఁగా, శూన్యతత్త్వంబని దలఁచినా శూన్యతత్త్వమే, తలఁచక నుం డినను శూన్యతత్త్వమే తలఁచితే తలపీడేరును ఒక వేళను తలఁచక పోయినను శూన్యతత్త్వమే, అనఁగా, మీ రనుకొనినను యనుకొన కున్నను శూన్యతత్త్వమే సుమండీ! శూన్యము, గగనము, ఆకాశము యీ మూఁడు నొక్కటే సుమా? అనఁగా నిదే సుషుప్తియవస్థ యనఁబడును. అనఁగా మనస్సు లేకుండుట. యిదియే నీశ్వరస్వరూపంబైన యాత్మస్వరూపము అవ్యాకృతుఁడై యున్నాఁడు. ఇంతవఱకు నాత్మస్వరూప నిర్ణయంబైనది. ఇఁకను జీవస్వరూప నిర్ణయము గావలసి యుండియున్నది. అయితే శాస్త్రప్రకారమును విచారించి చూచినచో జీవుఁడు అవిద్యా ప్రతిబింబితుఁ డనిన్ని, ఈశ్వరుఁడు మాయా ప్రతిబింబితుడనిన్ని, చెప్పఁబడు చున్నది. జీవుఁడు అంతఃకరణ ప్రతిబింబితుఁడును, అతఃకరణ యధిష్ఠానుండును, యీ మూఁడును గలిసి యీశ్వరతత్త్వ మనఁబడును. ఈశ్వరుఁడును, మాయయును మాయాధిష్ఠానమును యీ మూఁడును గలిసి యీశ్వరతత్త్వ మనఁబడును. మాయయును, మాయాధిష్ఠానుఁడును, మాయా ప్రతిబింబితుఁడును వెరసి అవిద్యయును, అవిద్యాధిష్ఠానుఁడును, అవిద్యాప్రతిబింబితుఁడును వెరశి మూఁడును, మాయ అవిద్య వెరశి యెనిమిది యష్టాంగములు యీ ప్రకారము జీవేశ్వరులు విభాగింపఁ బడియున్నవి. యిది శాస్త్రమార్గము, ఇఁకను స్వానుభవనీయము విచారించెదను. మంచిది, ఓ చదువరులారా!

శ్రద్ధతో శ్రవణముఁజేయుండి, చెప్పఁబడుచున్నది. ఏమనిన, నొకఁడు మేలుకొనియుండును. రెండవవాఁడు నిదురించియుండును. మూఁడవ వాఁడుమరణించియుండునుగదా? ఆముగ్గురులలో మొదటివాఁడుగదా? యిద్దఱను వీఁడునిదురించుచున్నాఁడనిన్ని వీఁడుమరణించియుండుననిన్ని, గ్రహించఁగలఁడు ఆ రెండవవాఁడును, మఱియును మూఁడవవాఁడును, యొకరినొకరు తెలిసికొనఁజాలరుగదా? సరే, మంచిది? యికను చచ్చిన వానిఁగూర్చి మతెందుకు? బ్రతికియున్న వాఁడగు నిదురించినవాని సంగతి విచారించెద, ఓ చదువరులారా! నిదురలో జీవుఁడున్నాఁడా? అవును? జీవుఁడుండును. హంస యుండునా? అంటే? హంస నొక యంత్రంబున గాలి లోపలికిని, వెలుపలికిని వచుచ్చు పోవుచు నుండునది హంసయనఁబడు.

క॥ వచ్చునదియుఁ బోవునదియుఁ।
జచ్చునదియుఁ గనఁగ లేక సహజము లనుచున్।
విచ్చల విడిగాఁ దిరుఁగుట।
చిచ్చునఁ బడునట్టి మిడుత చెలువమో వేమా॥

తా. అనఁగా, నీ లోకంబున నేది వచ్చుచుండునో యేది పోవుచుండునో తెలియ లేకుండానున్నారు. కావలసినయెడల సుషుప్త్యవస్థయందు నిదర్శనముఁ జూడండి? యేది వచ్చుచుండునో? యేది పోవుచుండునో? యేది పుట్టుచుండునో? యేది చచ్చుచుండునో? చక్కఁగా నిక్కంబుగా దెలియఁబడుసుమా? కొందఱు మూఢులు దేహము పుట్టుచు చచ్చుచుండుననఁ జెప్పెదరు. యీ సంగతి యెంత బాగానున్నది? శాస్త్రపండితులకు అనుభవముఁదెలియదు. యిప్పుడొక రయిల్ పరుగెత్తుచుంటే, చెట్లు చేమలు, యిండ్లు పరుగెత్తడములేదు. తానుఁ గూర్చుండు రెయిల్ పరుగెత్తితే నా చెట్లు చేమలు, యిండ్లు, పరుగెత్తునట్లు కనఁబడుచుండును. భ్రమచేత ననుకొనును. మఱొకటిచూడు, యొక కుర్రవాఁ డొక్కనాఁడు వానవాన

వల్లప్పని యీడుకొనుచున్నప్పుడు గిరగిర తిరుగును. అందుచేతను తల గిరగిర తిరుగునప్పుడు యిండ్లు, ఆకాశము, చెట్లు మొదలగునవి కూడ గిరగిర తిరుగుచుండును. అయితే నా చెట్లు, యిండ్లు, చేమలు వగైరా తిరుగుచున్నవా? నిజముగా చెట్లు, చేమలు, యిండ్లు, వాకిళ్లు తిరగడము లేదుగాని, యీ కుఱ్ఱవాని తల గిరగిర తిరుగుచుండు. ఆ ప్రకారముగానే నిదురలలో హంస వచ్చుచు పోవుచుంటే? దేహము పోవుచు వచ్చుచుండుననిఁ జెప్పుచున్నారు. అది సర్వవిధంబుల నబద్ధమేసుమా? నిజముగా నామరూపములులేని ప్రపంచకమెట్లు వచ్చుచుండునో యోచించుఁడీ. చదువరులారా! దొంగవేదాంతులు, క॥ వచ్చునదియుఁ బోవునదియుఁ। జచ్చునదియుఁ గనఁగలేక సహజములనుచుఁ। విచ్చల విడిగాఁ దిరుగుట। చిచ్చునఁ బడునట్టిమిడుత చెలువము వేమా॥ అనఁగా, నీ లోకమున నేదిపుట్టుచుండునో యేది చచ్చుచుండునో తెలియ లేకుండ నున్నారు. అనుభవ ప్రకారముఁ జూచినచో దేహము చచ్చుచు పుట్టుచుండ లేదుగాని, తెలివి మాత్రము వచ్చుచు పోవుచుండును. అట్లు స్వకర్మసూత్ర ముండువఱకు, తెలివి వచ్చుచు పోవుచుండును. అదెప్పుడు తెగిపోవునో యప్పుడు నశించి పోవును, అంతవఱకు చావదని నమ్మియుండుము. మంచిది, యీ తెల్వెక్కడనుండి వచ్చుచుండునో మీకేమైననుఁ దెలిసియున్నదా? అంటే? మీకేకాదు సగుణ స్వరూపులగు త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకైన దెలియఁజాలరు. ఇఁకను మనమెంతమాత్రము? పోనీ, ఎక్కడకుపోవుచుండునో దెలిసియున్నదా? ఓహో! యంతకన్ననుఁ దెలియదుసుమా? ఏమనిన, ఆ॥ జననమరణముల సరి స్వతంత్రుఁడుగాఁడు। మొదలు కర్తగాఁడు తుదనుగాఁడు। నడుమ కర్తయనుట నగుబాటుగాదొకో॥ వి॥ అనఁగా, నీలోకంబుననుండు మానవులందఱకును తెలివియెక్కడికి పోవుచుండునో యెక్కడనుండి వచ్చుచుండునో యేరికిం దెలియఁ బడఁ

జాలదు సుమా? ఎందుకు దెలియ దనఁగా, ముందుగానే తెలివిపో వుచుండుటచేఁ దెలియుట దుర్లభము తెలిసి కొనలేరు. సర్వము నెఱిఁగే యెఱుక విడిచిపెట్టి పోవుచుండును. ఆ॥ జన్మవదలి యెన్ని జన్మంబు లెత్తెనో। కర్మ ధర్మములనుఁ గణనలేక। కర్మధర్మములను కడ తేరలేఁడయా॥ వి॥ దీని కిపుడనుభవమును వ్రాయఁబడుచున్నది. ఈ లోకంబున నెన్ని జన్మము లెత్తుచుందురో, యా సంగతి వ్రాయఁ బడుచున్నది. ఏమనిన, స్వప్నంబులో నెన్ని జన్మము లెత్తుచుందురో విచారించుఁడీ. యిట్లు శ్రీమద్భాగవతములో నట్లు వ్రాయఁబడి యున్నది. అదేమన, "కలలోన జీవుఁడు గౌతూహలంబునఁ బెక్కు దేహంబుల జేరువడిసి॥" అనియున్నది. జాగ్రత్స్వప్నంబులలో నెన్ని కర్మలు జరుగుచుండునో విచారించుఁడీ. ఓ చదువరులారా! అట్టి కర్మంబులే నిజమని నమ్మియున్నారు. అట్టివారు పరమమూఢులు గారా? ఏమి? మళ్లిన్ని సుషుప్త్యవస్థలో నా కర్మాదులు లేవు, ఆ కారణముచేత నీ జడస్వరూపంబైన దేహము మిథ్యగాదా? స్వప్న దేహంబు లెట్లుబద్ధమో జాగ్రత దేహంబు లట్లనే మిథ్యయైనవి. యిందుకు నిదర్శనమేమనఁగా, సీ॥ కలగని మేలుకొన్న గతిగారవ మాయ ప్రపంచకంబులో। కలసి సమస్త భాగ్యములు గల్గిన నేమి ఫలంబు సంపద। ల్నిలువవు దేహమోహములు నీరుమలంబుల మట్టు గుంటలో। మొలచిన నీరుబుగ్గ యిది మోసముఁ జేసును నమ్మరాదు ని। శ్చలముగ కాళహస్తి నిటలాక్షుఁడ సాంబశివా మహాప్రభో॥ మొదటి రెండవస్థలలోఁ గర్మలుండునుగనుక దేహముండును. మూడవ యవస్థయగు సుషుప్తియందు కర్మములు లేవు గనుక దేహముండదు. యిది స్వభావసిద్ధంబైనది. యిందువల్లనే బ్రహ్మసత్యం జగత్తు మిథ్యయనఁబడును. శా॥ వైరాగ్యంబు దృఢంబుఁ జేసి పరతత్వజ్ఞా నమార్జించి స। ర్వారంభో పరమంబుఁగైకొని తురీయంబంది యీ రీతితో। గాఢాఢుండగు వానికిం గలుగునే యాగామియు। న్సం

చిత ప్రారబ్ధంబులు సంతతంబును బరబ్రహ్మాత్ముండై యుండగా॥ అని సీతారామాంజనేయ సంవాదములో నున్నది. శ్లో॥ సద్ఘనం చిద్ఘనం నిత్యమానంద ఘనమక్రియమ్ । ఏకమేవా ద్వయంబ్రహ్మ నేహానా నాస్తికించన॥ అని వివేకా చూడామణిలో నున్నది. అనఁగా, పరబ్రహ్మము సత్యస్వరూపుఁడును, జ్ఞానస్వరూపమును నిత్యమయినదియు, ఆనందస్వరూపంబును కర్మరహితమైనదియు నేకమై రెండవది లేనిదియుఁ గావున నాబ్రహ్మమందు నానాతత్వము. (అనేకములుగానుండుట) లేదు. ఉపనిషత్తు సత్యం జ్ఞానమనంతం ఆనందం సర్వశరీరోపాధి వినిర్ముక్తం కటకమకుటా ద్యుపాధి రహిత సువర్ణ ఘనవద్విజ్ఞాన ఘనచిన్మాత్ర స్వభావమాత్మ చైతన్యం పదార్థ స్స ప్రత్యగాత్మా॥ అని సర్వసారోపనిషత్తునందలిది. తా॥ సత్యజ్ఞానానంతానందమయమైనదియును, అన్ని విధముల శరీరోపాధులు లేనిదియును కటకమకుటాది భూషణభేదములు లేని బంగారు కడ్డీవంటిదియును, జ్ఞాన ఘనమైనదియును, చిత్స్వభావమైనదియును, ఆత్మ చైతన్యమైనదియును, బ్రహ్మమైనదియునునై ప్రకాశించునది యేదియో అదే నవిద్యోపాధికి లోఁబడినదియును త్వం పదముచే చెప్పబడునదియును నగు ప్రత్యగాత్మ యనఁబడును. ఈ ప్రత్యగాత్మే పరమాత్మయొక్క యంశమైయున్నదని శ్రీమద్భగవద్గీతలో నున్నది. అందుకు శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః॥ అని యున్నది. ఇందు కనుభవమిదిగో! ఒక తటాకమున్నది. దానికి మధ్యంబున నొక గట్టు పోసినచో రెండు తటాకములుగా నగఁబడును. ఆ గట్టు తొలగించితే నొక్కటే తటాకము ఒక యిల్లు యున్నది. ఆ యిల్లు కట్టకమును పేమియు లేదు. కట్టినతరువాత నంతియె. ఆ గృహము నాశనమైతే నేముండునోవిచారించుమా? దాని చిహ్నము (○) పూజ్యమనఁబడును. అదే పరతత్వాతీతపు చిహ్నము. "అదే నివృత్తి, నిర్విశేషస్వరూపము, నిరీహము, నిరాశ్రయము"

నిరామయము, పరమనిర్గుణము, సంగాసంగములులేనిది, సగుణనిర్గుణములులేనిది, సహితరహితములులేనిది, సదసత్తులుగానిది, సర్వాలోకములయందును, సర్వావస్థలయందును, సకలప్రదేశములయందును, నిండినిబిడీకృతమై స్వతసిద్ధముగానుండేది. ఓ చదువరులారా! మహాజాగ్రతతో వినఁగోరెద. నేమనిన, క॥ పంచావస్థలఁ దగిలియు। పంచావస్థలనుఁగడచు ప్రాజ్ఞుఁడు జగ। ద్వంచకుఁడై లోకులవలె। సంచారము సేయుచున్న [redacted]పగిమన్నా॥ అని యున్నదిగదా? మఱియును, ఆ॥ అది నొకటిఁ దెలిసి యది మనంబుననిల్పి। అది బాయకున్న సభ్యుఁడౌను। అది బాసినట్టి యాతఁడే భవ్యుఁడయా॥ వి॥ అనఁగా, దీని యర్థమేమనఁగా, తనకు ముందున్నది. యచలపరిపూర్ణ పరబ్రహ్మ పరమతత్త్వాతీతము. దానిని జ్ఞప్తియం దుంచుకొనవలెను. దాని మఱవక నుండిన యెడల నమరుఁడగును. దానిని మరచిన యెడల మరణించిన వాఁడగును. అనఁగా, నీ పరమతత్త్వాతీతము నెవ్వరైతే నేమరియుండునో మృతప్రాయుఁడని భావము. జ్ఞాపకముంచుకొనిన వాఁడు మృత్యుంజయుఁడనితాత్పర్యము. మృత్యువనఁగా, "మృత్యోస్సమృత్యు మాప్నోతి య ఇహ నానేవపశ్యతి। యదాహ్యే వైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే। అథ తస్య భయంభవతి॥" ఇత్యాది శ్రుతివాక్యరీతిగా నట్టి యఖండ పరిపూర్ణాచల పరబ్రహ్మమునందు నెవ్వఁడు భేదమును భావించుచున్నాఁడో వాఁడు మృత్యురూపంబగు జనన మరణ దుఃఖ సంసారసాగరంబున మునిఁగి దుఃఖపడుచుండును. ఎన్నటికిని ముక్తిఁ జెందదు సుమా? మఱియు శ్రుతి;— ఏక ఏవహి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః। ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్॥ అనెడి శ్రుతివాక్యరీతిగా సర్వభూతములయందు వ్యాపించియుండు పరబ్రహ్మంబగు నాత్మ యేకమైనను ఒక్క చంద్రుఁడే నీళ్లకుండలయందు ప్రతిఫలించి అనేక జీవులుగా తోఁచుచున్నాఁడు సుమీ? మఱియు గంగానది జలమునందు ప్రతిబింబించిన

సూర్యునకున్ను ఘండాలుని యింటి నీళ్లకుండలో ప్రతిబింబించిన సూర్యునకున్ను ఈ రెంటికిన్ని భేదములేనట్లు నీ యాంతఃకరణమునం దలి ప్రతిబింబమగు జీవునకున్ను కొంచెమైన నున్ను భేదము లేదు సుమా? ఓ చదువరులారా! వింటిరే! ఆ॥ అచలతత్త్వమసంగ సనుభవ గమ్యంబు । చూపి చెప్పగరాదు సూక్ష్మమదియె । మదికిం దోఁచుఁగాని । మర్మ మెన్నఁగరాదు॥ వి॥ పరమ తత్త్వాతీతము నెఱుఁగవలసిన మార్గమేమన, తే॥ ఆత్మతఃలోన గమకించి యనుదినంబు । నిర్గుణాత్మార్చనముఁ జేసి నిత్యమమర । ప్రత్యగాత్మను లోనెంచి ప్రబలుయోగి । సచ్చిదానంద పదమున సతతముండు॥ వి॥ అనఁగా, నాది శబ్దంబగు సోహంబనె ధ్యానము మొదటను యోగి యనువాఁడు నభ్యసించును. ప్రతిదినమును ఆత్మ సాక్షాత్కారంబగునది యీదారివలన తుదకు (ఉజ్యత ఇతిఽ యోగః=అయిక్యము) అయిక్యానుసంధానము చేయుచుండి తుదకు సచ్చిదానంద పరబ్రహ్మంబునందు తాను (యోగి) సతతముండు ఈ సంగతియే శ్రీరామకృష్ణ పరమహంసుల వారునుఁ గూడ ననియుండిరి. సగుణ బ్రహ్మము. మఱియు నిర్గుణ బ్రహ్మము. తే॥ ఎఱుక మఱుపులు గానిది యెఱుఁగలేరు । పరమపరిపూర్ణ సుఖమూనిఁ బట్టలేరు । ఉదరము చెదరని గుఱిఁగని యుండలేరు । విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ అనఁగా, వచ్చుచున్న దేదియో, పోవుచున్న దేదియో, పుట్టుచున్న దేదియో, మరణించుచున్న దేదియో, నిజముగా దెలియలేకుండ నున్నారు. అయితే ప్రతిరోజునందఱికిని జరుగుచునే యున్నది. యిందుకు శ్రీమద్భగవద్గీతలో నిట్లు వ్రాయఁబడియున్నది. "శ్లో॥ అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసేమృతం॥" అని యున్నది. తా॥ చైతన్యము నిత్యమును పోవుచు వచ్చుచున్నది. యిటువంటి దానిని చైతన్యస్వామిని ధ్యానము సేయుచున్నారు. చచ్చుచు పుట్టుచున్నవాఁడా దేవుఁడు? పరిపూర్ణమును సుఖమూని పట్టుకొనఁ

జాలరు. మనసు నొక గడియనైనను నిలుపలేరు. మంచిది, యెఱుక మఱుపు లగుచున్నదేది? అంటే? మనస్సే సంకల్పవికల్పములు, చేయించు చున్నది. అట్టి మనస్సు నిలువబెట్ట లేకుండ నున్నారు. మనుసు నిలుపలేని మంత్రములు పూజలేలా? బుద్ధిలేని పూజలు బూడిద పాలగును, భక్తిలేనిపూజ పత్రిచేటు. లోకంబున నాక్షేపణలు బహుమెండుగా జేతురు. ఆ॥ తమకుఁ గలుగుపెక్కు తప్పులు నుండగా । నొరులనేరమెంచు నోగు నెపుడు । చక్కిలంబుఁజూచి జంతి కేగిన యట్లు॥ వి॥ మఱియు, ఆ॥ ఆదినెఱుఁగలేని యల్పుఁడు తా మఱి । చెప్పలేఁడుగాని తప్పుఁబట్టు । శ్రోయనేర్చుకుక్క దొంతులు బేర్చునా॥ వి॥ అనఁగా, తానసేది వస్తువు పుట్టకమునుపేమో దెలియదు గదా? యింకను మఱియొకఱిని దూషింతురు. అట్లు దూషించినచో నేమి యుండును. క్రిందటికి యొకతె సవతికంచమని యశుద్ధము బెట్టుకొనిఁ దినెను. ఏమనఁగా, దాని కంచము జెడిపో తుందని యెక్కడనైన కంచముఁ జెడుతుందా? దానినోరే చెడిపోతుంది. ఆలాగున నీ సద్గ్రంధమును దూషించిన వారి నోరులే చెడిపోతవి? ఓహో చదువరులారా! ఈ పద్యమును వింటిరే! ఏమనిన, ఆ॥ ఎల్లలోకములను నే వస్తువున్నదో । తల్లి పిల్లసందు తగులు నదియె । నిస్తరంగ సంద్ర నియతలోఁ జూడురా॥ వి॥ అనఁగా, దీని యర్థమేమన, సకల ప్రదేశములందును, సకలావస్థలయందును, సకల దేశములందును, నిండి నిబిడీకృతమై సూదిదూరుసంత చిన్న బిలము లేక నిండి యుండునదే పరమతత్త్వాతీతము. యిక్కడను తల్లి యనఁగా, పరమాత్మ స్వరూపంబగు పరమతత్త్వాతీతము. పిల్ల యనఁగా ప్రత్యగాత్మ, యీ రెండే జీవాత్మపరమాత్మలని భావము. గురుఁడు శిష్యుఁడు సందు గుఱ్తొక్కటాయె. అయితే నలలు లేని సముద్రమువలె నుండుమా? మఱియును, ఆ॥ ఎఱుక మఱుపులందు నేమేమిఁ దోఁచినా । సరికి గుఱియురాదు సత్యమునకు । పరమ నిర్గు

ణంబు పాటించిగనవలె॥ వి॥ అనఁగా, దీనియర్థమేమన, నిత్యమును మనకు తెలివి వచ్చుచు పోవుచుండును. అవియే జాగ్రత్స్వషుప్తు లనెదరు. తెలివి పోయిన తరువాత నందటికినిఁ బోవుచుండునుగాని, యప్పటి వర్తమానమేమి తెలియదు. త్రిమూర్తులకు సహా సుమా? తెలివి రాకముందునుఁ గూడ నట్లాగుననే సుమా? అయితే నొక్క-తెలివియుండి దేహము లేనిమార్పులోనుఁ జక్కఁగా దెలుస్తుంది. ఏమనిన, నావరణమగు దేహముండదు గనుక కరతలామలకముగా దెలియఁబడును. ఎటుక మఱుపులలో ననఁగా, తెలివి వచ్చేటప్పుడు పోయేటప్పుడు తెలియఁబడదు సుమా? తెలివిని, దేహమును రెండు పదార్థములు గదా మార్చఁబడుచున్నవి. దేహముండి, తెలివిలేని మార్పు సుషుప్తి గాఢనిద్ర, అప్పట్లో తన్నుఁదా దెలియ లేఁదు సుమా? పోని, దేహమును, తెలివిని రెండు కలిసి యుండునప్పుడు తెలిసికొనలేము. ఏమనిన, పాలు నీరువలె నేకీభవించి యుండును. అప్పుడు తెలివేయనిఁ దెలియఁబడు చున్నది. మఱి తెలివి యొక్క-టుండి, దేహము లేని మూడవమార్పుయందు పరమతత్త్వాతీతముఁ దెలియఁబడును, అదే తురీయావస్థ యనఁబడును. అదే సవికల్ప సమాధి, అదే జీవన్ముక్తి, అదే సరూప మనోనాశనము. సరూప మనోనాశనము రోజు యగుచున్నది. కందము॥ ఎందాక మనసు నిల్చిన । నందాకను పూర్ణసుఖము నరుడుగఁ దోఁచుఁ । పొందిక మీఱిన బ్రహ్మము । సుందరమగు తన్మయంబుఁ జూడర వేమా॥ అనఁగా, దీని తాత్పర్యమేమన, నెందాక మనస్సుయుండునో యంత వఱకు బ్రహ్మానందము గలుఁగదు సుమా? మనసు లేకుండ పొందేదే శ్రుతి;—బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం। విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం । ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం । భావాతీతం త్రిగుణరహితం సద్గురుం త్వాం నమామి॥ అనియున్నది. మనస్సు లేకుండాను బొందేది బ్రహ్మ

నంద మనఁబడును. మనస్సుతోఁ బొందునది విద్యానంద మనఁబడును. మఱియు, నింద్రియముల ద్వారా పొందేది విషయానంద మని పేరు. అన్నింటికంటే పరమానందమనెడి బ్రహ్మానందము శ్రేష్ఠము. "ఆనందో బ్రాహ్మణో విద్వాన్" అని శ్రుతియున్నది. శ్రుతి;— న భూమి రాపో మమ వహ్నిరస్తి నచానిలోమేఽస్తి నచాంబరంచ ఏవం విదిత్వా పరమాత్మరూపం గుహాయాం నిష్కళమ ద్వితీయమ్ సమస్త సాక్షిం సదసద్విహీనం ప్రయాతిశుద్ధం పరమాత్మరూపమ్॥ అని కైవల్యోప నిషత్తునందున్నది. దీని తాత్పర్యమేమన, పరమాత్మకు పంచభూతములు లేవు. హృదయకుహరమందుండునదియును, రూపరహితమైనదియును, రెండనది లేనిదియును, సర్వమునకు సాక్షి యైనదియును, సత్తు అసత్తులు లేనిదియును నగు పరమాత్మ స్వరూపమె పరమతత్త్వాతీత మనఁబడును. మఱియు నో చదువరులారా! ఆత్మ ధ్యానలక్షణముఁ జెప్పఁబడుచున్నది. శ్రుతి;— బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబ తయా స్థితిః। ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానంద దాయినీ॥ అని యపరోక్షానుభూతి. తా॥ బ్రహ్మమే నేననెడి సద్వృత్తిచేత (యితర ప్రమాణములచేఁ బాధింపఁబడని వృత్తిచే) నిరాలంబత్వముగా (దేహాధ్యాను సారము) ఈ పరమ తత్త్వాతీతము. క॥ చెప్పియుఁ జూపఁగరానిది। మెప్పుగ మదిలోనఁ జూఁచిన। త్రిప్పులుఁబడకనుఁ జూఁచిన। యొప్పుగ జగమెల్ల నిండియుండును వేమా॥ అని యున్నది. ఈ పరమతత్త్వాతీతము॥ తే॥ చింతనామృతపాన విశేషమత్త। చిత్తమమరిన ఘనులందు చిన్మయంబు। వినుతికెక్కిన పరిపూర్ణ విద్యయగును। విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ ఇందుకు మార్గంబేమన, ఆ॥ చిత్రదీపమువలె చింత నిలఁ ద్రొక్కి। మిత్రముగను మనసు మెలకువెఱిఁగి। శత్రుగుణములెల్ల సాధించుటయె ముక్తి॥ వి॥ యిటుల నడచినచో నతివేగమున ముక్తిఁ గలుఁగుటకు సందేహము లేదని మహాపెద్దలగు శ్రీ

వేమనయోగి వక్కాణించి యున్నాఁడు. కాఁబట్టి, ఓ చదువరులా రా! ఆ॥ ఊపిరున్నయపుడె యుపదేశమందుము । రూపు మాయు నపుడు రూఢిగాను । బాపఁడైననేమి బడబాగ్ని మ్రింగునా?॥ వి॥ ఓహో! ఈ ఘటమందు నూపిరున్నయపుడె యుపదేశమందుము. ప్రాణములు పోవునపుడు స్మారకముండదు. ఏమనగ, ఆ॥ కఫము మీఱి మఱియుఁ గినులు మూఁతలువడి । బుద్ధి తప్పిచాలఁ బుడమి మఱచు । వేళలందు నిన్ను వెదకుటఁ గాదొకో । విమలగుణ రాజ యోగీంద్ర వేమనార్య॥ అని యున్నది. యిందుకు శ్రీపాండవగీత లో నిట్లు వ్రాయఁబడియున్నది. ఏమనిన, "ప్రాణప్రయాణసమయె కఫవాతపిత్తై కంఠావరోధనం విధౌ స్మరణం కుతస్తే॥" అనియున్నది. కాఁబట్టి, క॥ దినములు వ్యర్థముఁ గాకనుఁ । గనుచుండుము నాత్మ నెపుడు ఘనగురుబోధన । నిను నీ వెఱుఁగిక యున్నఁ । గోనకొని మదిఁ జెఱుచు నిన్నుఁ గొబ్బున వేమా॥ అని శ్రీవేమనార్యుని వా క్యంబున్నది. ఈ పరమతత్త్వాతీతము నిట్లు సాధించవలయును. ఎ ట్లాగనఁగా, ఆ॥ పతియొనర్పఁ బూని సతిని వేడినయట్లు । మతిని వేడి పరము మఱుఁగుఁ దెలిసె । గతిసఁ గోరుచుండు ఘనయోగి యిలలో న । విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ అని యున్నది. యీ లాగైతేనేగాని, మనస్సు లక్ష్యముంచదు సుమా? మొదటను కొడు కువలె బ్రతిమాలుకొని, బ్రతిమాలుకొని, తుదకు తల్లికని మగఁ డయ్యెడె తత్త్వమగు పరమ తత్త్వాతీతమే సుమా? మొదటను మార్జాలమువలె వెళ్లి పులివలెనుఁ బట్టుకొనవలయును సుమా? ఓ చదువరులారా! ఈ మహామాయ స్వరూపంబగు నీ మనస్సు మహా చిక్కులు పెట్టును సుమా? కావున మహాజాగ్రతగా నుండవలయు ను. ఒక్క నిమిషంబైన నేమఱి యుండకూడదు. ఒకవేళ నేమఱి యుందురా యంటే నతాత్తున మీఁద పడుతుంది సుమా? దీనివలన చాలామంది చెడిపోయి యున్నారు.

గద్య.

ఇతి శ్రీ కాశీక్షేత్రనివాసుఁడగు, శ్రీమత్పరమహంసావధూ
త దిగంబర స్వాములవారి ప్రియ శిష్యుఁడగు, శ్రీ
శంకరమంచి లక్ష్మీనృసింహ రాజయోగీంద్రుల
వారి ప్రియశిష్యుఁడగు, శ్రీగంజాంజిల్లా బరం
పురం నివాసుఁడగు, శ్రీ తారక బ్రహ్మా
నుభవి పూడిపెద్ది - సాంబశివరావు
గారిచే విరచితమైన,



పరమ తత్త్వాతీత బోధిని.

సర్వం సంపూర్ణము.



ఓం

శ్రీ సాంబశివార్పణమస్తు.



వేమనపద్య రహస్యార్థ తాత్పర్యబోధిని పద్యములను, తాత్పర్యమును కలది. ప్రథమ సంపుటము. 160 పుటలు. ౧-౦-౦
డిటో, ద్వితీయ సంపుటము. 160 పుటలు. ౧=౦=౦
వేదాంత కఠిన పదార్థ మంజరి. ౦-౪-౦
పునర్జన్మ సందేహ నివర్తిని. ౦-౪-౦
సద్యోముక్తిబోధిని. ౦-౫-౦
వేదాంత ప్రశ్నోత్తర ముక్తావళి అనెడి గురుశిష్య సంవాదము. ౦-౬-౦
అనుభవానంద దీపిక. ౦-౬-౦
మృత్యుంజయ బోధిని. ౦-౨-౦
సహజాద్వైతానుభవప్రకాశిక. ౦-౨-౦
సామెతల బ్రహ్మజ్ఞానరహస్యార్థబోధిని. ౦-౫-౦
బ్రహ్మజ్ఞానఉపదేశవాక్యంబులు, పరమహంసవిద్య. ౦-3-౦
మనోవ్యాధికిమందు. అను గ్రంథము. ౦-౨-౦
హేమతారకవిద్య. ౦-౨-౦
జీవన్ముక్తిదాయిని, పుత్రోత్సాహప్రదాయిని. ౦-3-౦
సూక్ష్మమోక్షమార్గము. ౦-౫-౦
పరమ పురుషార్థ పంచప్రశ్నోత్తర రత్నములు. ౦-౪-౦
శుష్కవేదాంతసిద్ధాంతులగర్వాపహారి. ౦-3-౦
వీడేవాడు అను గ్రంథము. ౦-౨-౦
గగనవిద్య. బ్రహ్మజ్ఞాన గానామృతము. ౦-3-౦
అజ్ఞానధ్వంసిని. ౦-౪-౦
విగ్రహారాధనమీమాంస. ౦-౨-౦
పాపవిమోచని. ౦-౨-౦
ప్రకృతిపురుష సంయోగరహస్యబోధిని. ౦-౨-౦

శ్రీ సన్యాసోపన్యాసము. ౦-3-౦
శ్రీ విదేహకైవల్యానందబోధిని. ౦-3-౦
లింగదేహభంగబోధిని. ౦-౨-౦
శ్రీ వేమనజ్ఞాన పంచ పద్య రత్నములు తాత్పర్య సహితము. ౦-౨-౦
ఆశాపాశచ్ఛేదిని. ౦-౨-౦
పరమార్థ తత్త్వ రహస్యబోధిని. ౦-౨-౦
ఆత్మనివేదిని. ౦-౨-౦
నిష్ప్రతియోగికబ్రహ్మబోధిని. ౦-౨-౦
ఒక్కటియు త్రిలో ముక్తిబోధిని. ౦-౨-౦
నరకోద్ధారిణి. ౦-౨-౦
దొంగవేదాంత భంగబోధిని. ౦-౨-౦
మహాతుర్యబోధిని. ౦-౨-౦
అర్థ పంచకము. ౦-౨-౦
సహజామనస్కానుభవబోధిని. ౦-౨-౦
అద్వైతునకును, బ్రాహ్మ్యండునకును, సంవాదము. ౦-౨-౦
శ్రుతిమాలార్థానుభవబోధిని. ౦-౨-౦
సంసారబంధ విముక్త్యోపాయబోధిని. ౦-౨-౦
అద్వైతామృతబోధిని. ౦-౨-౦
మహాద్వైతబోధిని. ౦-౨-౦
మిక్కిలి ప్రియమైన వస్తువేదో దానిని గూర్చి లెక్చరు. ౦-౨-౦
స్మృతి జీవబోధిని. ౦-౨-౦
నిర్వాసనామౌనబోధిని. ౦-౨-౦
భ్రమభంజని. ౦-౨-౦
స్వర్గమార్గబోధిని. ౦-౨-౦
పరమతత్త్వాతీతబోధిని. ౦-౨-౦
ఆనందరామాయణము వచనకావ్యము.— ఇందు రామాయణకథయంతయు సమగ్రముగ నున్నది. ౧-౦-౦
వేదాంతరత్నాకరము, శ్లో. తా. ౦-౮-౦
నిర్గుణాత్మజ్ఞానసంయోగకందార్థ రత్నావళి అచల ప్రబోధము. ౦-౬-౦
దేవాంగపురాణము. శ్లో. తా. ౦-౧౪-౦

---

...య్య - త్యాగరాయసెట్టి, ప్రాతచాకలపేట, చెన్నపటణము.

**వేమన జ్ఞానమార్గ పద్యములు.**— (3002) ఇందు నీతి, ఆచారము, ధర్మము, వేదాంతము, మొదలగు పలువిషయముల గురించి వేమనగారిచే రచియింపఁబడి మేలయిన దళసరి కాగితముల యందు పెద్దఅక్షరములలో ముద్రింపఁబడి సీమకాలికోగల మేలైనబైండు చేసియున్నది. ౨-౦-౦

**వేమనయోగివిరచిత వేదాంత సిద్ధాంతము.**— పద్యములును, తాత్పర్యమును కలది. ఇందు ౫౦౦ పద్యములు కలవు. వేదాంత తత్త్వమునంతయు విస్తరముగా దెలియజేయును. ౦-౧౪-౦

**వేమనపద్యములు.**— ఆయాజాతులయొక్కయు ఆయా విషయముల యొక్కయు వివరణములు వేర్వేరుగా దెలియునట్లు విభజింపఁబడి ముద్రింపఁబడి యున్నది. ఇందు ౧౭౦౦ పద్యములు కలవు. ౦-౧౨-౦

**గురుశిష్యసంవాద - వైద్యచింతామణి.** ఇందు నవనాథ సిద్ధక్రియలు, ద్రవ్యశుద్ధి, రసయోగకషాయంబులు, తైలలేహ్య ఘృత చూర్ణంబులు, సర్వధూపిత భేషజ్య క్రమంబులు, మొదలగు సారతమాంశంబులు విపులంబుగ విశదీకరింపఁబడి యున్నది. ఈ యొక గ్రంథముచేత సకలవైద్య విషయము లెరుంగ గలరు. ౧-౧౨-౦

**శ్రీసుదర్శన రామానుజదాసు కీర్తనలు.** ఇవి హరికథా కాలక్షేపముచేయు భాగవతులకు మిక్కిలి వుపయోగము.— ఇందలి 230 కీర్తనలు సకలమైన కథలకును ఆయాకథల ననుసరించి కీర్తనలువుపయోగించవచ్చును. ౧-౦-౦

**విష్ణుపురాణము.**— పద్యకావ్యము టీకా సహితము, ఇది పదునెనిమిదిపురాణములలో నొకటియై యుండుటే గాక ప్రపంచోత్పత్తి, దేవతలు, ఋషులు, క్షత్రియులు మొదలగువారి ఉత్పత్తియును, శ్రీకృష్ణమూర్తియొక్క మాహాత్మ్యమును దెలుపును. ౧-౧౨-౦

శృతిదేవుని చరిత్రము. ౦-౨-౦

భగవద్గీత వచనము. ౦-౪-౦

ముముక్షుజనకల్పకము. ౦-౬-౦

రత్నమాలికాపరిణయం హరికథ. ౦-౨-౦

హరిశ్చంద్రోపాఖ్యానం హరికథ. ౦-౨-౦

సీమంతినీచరిత్రముయక్షగానము. ౦-౨-౦

సందేహనివారణ ప్రకాశిక. ౦-౨-౦

కోడెల రామదాసు చరిత్రము. ౦-౨-౦

శ్రీరాజయోగానందతత్త్వములు. ౦-౨-౦

తత్త్వార్థముక్తాకలాపం వచనము. ౦-౨-౦

దశవింశతితత్త్వకందార్థములు. ౦-౧-౦

అమృతబిందోపనిషత్తు. శ్లో. తా. ౦-౨-౦

శుద్ధనిర్గుణతత్త్వకందార్థములు తాత్పర్య సహితము. ౦-౧౨-౦

**పాతంజలయోగశాస్త్రము:**—మూలసూత్రములు, తెనుఁగు తాత్పర్య విశేషార్థములతో. ౧-౦-౦

**సకలార్థసాగరము:**— సకల మతములు, సకల మతాచార్యుల చరిత్రములు, సకలశాస్త్ర విషయములు గలవు. ౧-౧౨-౦

విచారసాగరము. 3-౦-౦

హఠయోగప్రదీపిక 128 యోగాసన పటములు గలవు. 3-౦-౦

శ్రీలక్ష్మీస్తోత్రరత్నత్రయము: టీకాతాత్పర్య సహితము. ౦-౧౨-౦

స్తోత్రరత్నపంచకము. ౦-౭-౦

మణిత్రయి తాత్పర్యసహితము. ౦-౬-౦

శ్రీమద్రామానుజ చరిత్రము.— ౧-౦-౦

ఓం
శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.




# పరమార్థతత్త్వ రహస్య బోధిని.

ఇత్యాది

గంజాంజిల్లా - బరంపురం నివాసుఁడగు

శ్రీ తారక బ్రహ్మానుభవి

పూడిపెద్ది - సాంబశివరావుగారిచే,

శ్రుత్యుక్త్యనుభవములతో

విరచితంబైనది.

చెన్నపట్టణము :

ప్రాతచాకలపేటయందుండు

పమ్మి - త్యాగరాయసెట్టిగారి

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

1916. సం.

వెల -౨ అణాలు.] [కాపీరైట్.

[illegible]

కుమ్మ—వేదాంతసిద్ధాంతులగర్వాపహారి. ౦-౩-౦

పింఢేవాఁడు అను వేదాంత గ్రంథము. ౦-౨-౦

గగనవిద్య. బ్రహ్మజ్ఞాన గానామృతము. ౦-౩-౦

కృత దేవుని చరిత్రము. ౦-౨-౦

హఠయోగప్రదీపిక 128 రోగాగాపన పటములు గలవు. ౩=౦=౦

శ్రీలక్ష్మీస్తోత్రరత్నత్రయము. టీకాతాత్పర్య సహితము. ౦=౧౨=౦

నిర్గుణాత్మజ్ఞానసంయోగకందార్థరత్నావళి అనియెడు అచల ప్రబోధము. ౦=౬=౦

అజ్ఞానధ్వంసిని. ౦-౪-౦

విగ్రహారాధనమీమాంస. ౦-౨-౦

పాపవిమోచని. ౦-౨-౦

ప్రకృతిపురుష సంయోగరహస్యబోధిని. ౦=౨=౦

శ్రీ సన్న్యాసోపన్యాసము. ౦=౩=౦

శ్రీ విదేహకైవల్యానందబోధిని. ౦=౩=౦

లింగదేహభంగబోధిని. ౦=౨=౦

శ్రీ వేమనజ్ఞాన పంచ పద్య రత్నములు తాత్పర్య సహితము. ౦=౨=౦

ఆశాపాశచ్ఛేదిని. ౦=౨=౦

పరమార్థ తత్త్వ రహస్యబోధిని. ౦=౨=౦

ఆత్మనివేదిని. ౦=౨=౦

నివృత్తియోగికబ్రహ్మబోధిని. ౦=౨=౦

ఒక్కయుక్తిలో ముక్తిబోధిని. ౦=౨=౦

నరకోద్ధారిణి. ౦=౨=౦

ధోంగవేదాంత భంగబోధిని. ౦=౨=౦

మహాతుర్యబోధిని. ౦-౨=౦

అర్థపంచకము. ౦=౨=౦

సహజామనస్కానుభవబోధిని. ౦=౨=౦

అద్వైతునకును, బ్రాహ్మణ్యుండునకును, సంవాదము. ౦=౨=౦

శ్రుతిమాలార్థానుభవబోధిని. ౦=౨=౦

సంసారబంధ విముక్త్యుపాయబోధిని. ౦=౨=౦

అద్వైతామృతబోధిని. ౦=౨=౦

మహాద్వైతబోధిని. ౦=౨=౦

మిక్కిలి ప్రియమైన వస్తువేదో వాటిని గూర్చి లెక్చరు. ౦=౨=౦

మృతజీవబోధిని. ౦=౨=౦

నిర్వాసనామౌనబోధిని. ౦=౨=౦

భ్రమభంజని. ౦=౨=౦

స్వధర్మ మర్మబోధిని. ౦=౨=౦

పరమతత్త్వాతీతబోధిని. ౦=౨=౦

పాతంజలయోగశాస్త్రము:—మూలసూత్రములు, తెనుఁగు తాత్పర్య విశేషార్థములతో. ౧=౦=౦

సకలార్థసాగరము:— సకల మతములు, సకల మతాచార్యుల చరిత్రములు, సకలశాస్త్ర విషయములు గలవు. ౧=౧౨=౦

వాల్మీకిరామాయణము, శ్లోకతాత్పర్యం.

బాలకాండము. ౧=౦=౦

అయోధ్యాకాండము. ౨=౦=౦

అరణ్యకాండము. ౧=౦=౦

కిష్కింధకాండము. ౧=౦=౦

సుందరకాండము. ౧-౦-౦

యుద్ధకాండము. ౨=౦=౦

లోకరహస్యము. ౦=౫=౦

నంగనాచిచరిత్రము. ౦=౪=౦

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు దొరకును. వలయువారు దిగువ విలాసమునకు వ్రాసికొనవలయును.

పమ్మి - త్యాగరాయసెట్టి.

[illegible]



ఓం

శ్రీ సద్గురుభ్యోనమః.



# పరమార్థతత్త్వ రహస్య బోధిని.

## సద్గురుస్తోత్రము.

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

శ్లో॥ శ్రీహంసం పరమానంద ముపదేష్టా రమీశ్వరమ్।
వ్యాపకం సర్వలోకానాం కారణం తం నమామ్యహమ్॥

శ్రుతి;— ఉపాస్యఇతిచ సర్వశరీరస్థ చైతన్య బ్రహ్మప్రాపకో గురురుపాస్యః॥ అనఁగా, నుపాసింపఁదగిన వాఁడెవ్వఁడు? సకల శరీరములయందునుండు చైతన్యమైనట్టి బ్రహ్మము నొందింపఁజేయు గురువే యుపాసింపఁ దగినవాఁడు. పరమార్థమనఁగా, తే॥ పరమ సిద్ధాంతమగునట్టి బయలుఁజేరి। పట్టువిడుపులు వదలి దాఁబ్రాకనిలిచి। వట్టిదని లోకపాశంబు వదలనగును। విమలగుణరాజ యోగీంద్ర వేమనార్య॥ మఱియు, సకల చింతలలోపల తత్త్వచింతయే శ్రేష్టము. శ్రుతి;— ఉత్తమా - తత్త్వచింతైవ - మధ్యమం - శాస్త్రచింతనం। అధమా - మంత్రచింతాచ - తీర్థభ్రాంత్య ధమాధమా॥ ఓ చదువరులారా! నిత్యానిత్యవస్తు వివేకము గలవాఁడై, యనిత్యమగు దేహేంద్రియాది జగత్తు సర్వమునందున్ను నిరాశ గలిగి, నిత్యమగు పరబ్రహ్మంబైన యాత్మను ధ్యానించుము తన్మయముగా నుండుటే తత్త్వ

చింత యనఁబడును. ఇందుకు మఱియొకటిగలదు. ఏమనిన, శ్రుతి;— విహాయ - శాస్త్రజాలాని - యత్సత్యం - తదుపాస్యతాం। అనంత కర్మ - శౌచంచ - జపోయజ్ఞ స్తథైవచ। తీర్థయాత్రాభి గమనం యావత్ - తత్త్వం - నవిదంతి॥ అని పైంగలోపనిషత్తు రీతిగా, నానావిధ శాస్త్రంబులు చదువ వలయు ననెడి భ్రాంతిని విడిచిపెట్టి తత్త్వవివేకముచేసి ఆత్మయే సత్యమగు బ్రహ్మంబని యెఱిఁగి ఆత్మాను సంధానమే చేయుచుండ వలయును. స్నాన, సంధ్య, జపతప, హోమ, నేను, యాగ, తీర్థయాత్రాది సకల సత్కర్మలు చేయుచుండుటవలన, తత్త్వజ్ఞానము గలుఁగఁజాలదు సుమా? అందువలన నాత్మానుభవము గలుఁగఁజాలదు. అయితే నీలోకమునందు రహస్యమైన వస్తువేది? ఏదియనఁగా నతిరహస్యము బట్టబయలని లోకోక్తిఁగలదు. ఇది యందఱకు నొక మాటగా దెలిసితే నేమి ప్రయోజనము? విచారణ జ్ఞానమువల్లను బ్రహ్మవేత్తఁ గాఁజాలఁడు ఏమనిన, శ్రుతి;— అనుభూతిం - వినా - మూఢో - వృథా - బ్రహ్మణి - మోదతే। ప్రతిబింబిత - శాఖాగ్ర - ఫలాస్వాదన - మోదవత్॥ అనఁగా స్వానుభవ జ్ఞానములేక వేదాంత శాస్త్ర శ్రవణ మనెడి విచారణ జ్ఞానమువల్లనే, నేను పరబ్రహ్మంబును దెలిసికొంటినని సంతోషించువాఁడు, పిచ్చివాఁడు. అట్టివాఁడొక తటాక సమీపమందుండు మామిడిచెట్టు, ఆ తటాక జలమునందు ప్రతిబింబించఁగా నా ప్రతిబింబమునరదుండు మామిడిపండును జూచి, ఆ పండును తానుతిన్నట్లు సంతోషించునట్టి మూఢునితో సమానుఁ డగుచున్నాఁడు. కాఁబట్టి ఎన్నాళ్లు వేదాంత గ్రంథములు, భారత, భాగవత, భగవద్గీత, మొదలగు గ్రంథములు చదివినను శ్రవణముఁ జేసినను, గురుకటాక్షముచేత స్వానుభవమును పొందకున్న యెడల నేమిప్రయోజనము లేదుసుమా? శ్లో॥ గురుముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః। అన్యథా లభితం నాస్తి సత్యం సత్యం న సంశయః॥ టీ॥ చదువవలెనాగా [illegible]

చూడనవలయును. కావున యతిరహస్యమైనది బట్టబయలు. ఇదివరకటగా నందరకును దెలిసినయంశమేనుమా? అయితే నిందుకు, బ్రహ్మానుభవ ముండవలయును. అనుభవమనఁగానేమి? ఇదిగో చదువరులారా! జాగ్ర త్తగావినఁగోరెదను. ఏమనిన, తే॥ నిరతమాత్మచిదానంద నిలయమందు। నరవిలోఁకుత పరిపూర్ణ సౌఖ్య మెుత్తిఁగి । యరిదియగు బయల్ జేరుట యనుభవంబు॥ వి। లోకంబున ననుభవంబని చాలామంది యనెదరు గాని నిజముగా నడిగినచో చెప్పఁజాలరు. అనుభవ ముండవలెనని యనెదరు. ఆ యనుభవమనఁగా నేమో యింతకన్న హెచ్చు తెలిసి యుంటె చెప్పరాదా? అంతకన్న హెచ్చు యీ ప్రపంచంబులోనే లేదు. ఆ॥ స్వానుభూతిలేక శాస్త్రవాసనలచే । సంశయంబు చెడదు సాధకులకు। చిత్రదీపమునను చీఁకటిచెడనట్టు॥ వి॥ ఇది పరమార్థతత్త్వరహస్యము. ఆ॥ సాధనంబులేక నమకూడదెప్పుడు । బోధలేనివిద్య పొందదెపుడు। పాదుకొల్పుమదిని భావించిచూడురా॥ వి॥ అందునిమిత్తమే సాధనచతుష్టయ సంపత్తిలేనివాఁడు బ్రహ్మవిద్యకు పనికిరాఁడునుమా? ఎంతపండితుఁడుగాని, యెన్నివిద్యలు నేర్చినగాని, సాధన చతుష్టయసంపత్తి లేనిదే బ్రహ్మవిద్యకు పనికిరాఁడు "హరిః ఓమ్, అథాఽశ్వలాయనో భగవన్తం పరమేష్ఠినం పరిసమేత్యోవాచ॥" తా॥ అనంతరము (సాధన చతుష్టయసంపత్తిని బొందినతర్వాత) ఆశ్వలాయన ముని భగవంతుఁడైన బ్రహ్మదేవుని సన్నిధికేఁగి యిట్లని యడుగుచున్నాఁడు. విశేషార్థము. అథశబ్దము మంగళార్థమును, గ్రంథప్రారంభమును, అధికారప్రాప్త్యనంతరకాలమును సైతము సూచించును. సాధన చతుష్టయమనఁగా, నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము, అందు "నిత్యానిత్య వివేకేన పునస్సంసార నిర్వృతిః । తద్వినా జన్మకోట్యాపి బంధచ్ఛేదో నశిధ్యతి॥" అనఁగా నిత్యానిత్య వస్తువివేక జ్ఞానము లేనివాఁడు కోటిజన్మములకైనను మోక్షంబు నొందఁజాలఁడునుమా? నిత్యానిత్య విచారమనఁగా,

దేహేంద్రియ మనఃప్రాణాదు లన్నియు జడ దృశ్యకారములై యుండు టవలన ననిత్యములై యున్నవి. కొందఱు మూఢులు, పద్యం॥ కాయ మనిత్యమున్ దెలివి గానక మంత్ర లయాదియోగసా। ధ్యమను లైన సిద్ధులను బ్రజ్ఞలనుగాఁ దలపోసి మూఢులై । మాయల నందువారు ఘనమంత్రపుయోగులుగాని ముక్తికిన్ । డాయగ లేరు వీరలకు దంభమె మోక్షము లెంచిచూడగన్॥ అని సూతుఁడు శౌనకాది మహాము నులతో నిట్లనియె. అనఁగా నీ దేహ మనిత్యంబనిఁ దెలియక చేయు చున్నవన్నియు నేమిప్రయోజనము లేదని బోధించియున్నారు. ఈ నిత్యా నిత్య వివేకమే మొదటి ముఖ్యమైన సాధనము. ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము, ఈ లోకమునందలి స్రక్చందన వనితాది విషయభోగము లయందును స్వర్గలోకమునందలి అమృతపానాది భోగములయందును ఆశను విడిచియుండుట. అయితే నో చదువరులారా! ఆ॥ ఆశవిడకఁగాని పాశముక్తుఁడుగాఁడు । ముక్తుఁడైనఁగాని మృతుఁడుగాఁడు । మృతము పడయకున్న క్షితిమోహమూఁడదు॥ వి॥—ఆ॥ ఆశపాశలెల్ల నామూల ముగఁగోసి । పాఱవేయకున్న ఫలముఁగలదె? । కొక్కువేలులకునుఁ జిక్కిచచ్చినరీతి॥ వి॥— ఆ॥ ఆశచేతమనుజు లాయువుఁగలనాళ్లుఁ । దిరుగుచుందురుభ్రమఁ ద్రిప్పలేక। ముఱికిభాండమందు మునురు నీఁగల భంగి॥ వి॥ యిఁకను శమాదిషట్క సంపత్తేమనఁగా;— శమము, దమము, తితిక్ష, ఉపరతి, సమాధానము, శ్రద్ధ, అను నీయాఱును శమాదిషట్కము. ఇవి గలిగుండుట, దీనిపేరే వైరాగ్యము, ఆత్మ బోధయం దిట్లు వ్రాయఁబడియున్నది. ఏమనిన, శ్లో॥ తపోభిః క్షీణ పాపానాం శాంతానాం వీతరాగిణాం । ముముక్షూణా మపేక్ష్యోయ మాత్మబోధో విధీయతే॥ అనియున్నది. అనఁగా, సాధన చతుష్టయ సంపత్తిగలవానికే నాత్మబోధ చేయవలెను. తక్కిన వారల కెంతమా త్ర ముపదేశించఁదగదు. ప్రస్తుత కాలమునందు ననేకులుపదేశము బొం దుచుందురు. లోకమునం దుపనయనము లేనిదే బ్రాహ్మణుఁడెట్లుగాఁ

ఉ॥ యిట్లు సాధన చతుష్టయ సంపత్తి లేనిదే బ్రహ్మవిద్యకు పనికిరారు. ప్లీడరు టెస్టు ప్యాసుకానిదే ప్లీడరు కాఁగలరా? ఆలాగుననే సాధనచతుష్టయము ప్యాసుకానిదే బ్రహ్మవిద్యకు పనికిరాఁడు. శమమనఁగా, నంతరింద్రియ నిగ్రహము, దమమనఁగా బాహ్యేంద్రియ నిగ్రహము, తితీక్షయనఁగా సుఖదుఃఖములు, లాభలాభములు, జనన మరణములు, మానావమానములు, సమముగా గ్రహించునట్టి స్థైరణ, ఉపరతియనఁగా పరమాత్మయందే క్రీడించుట, సమాధానమనఁగా చిత్తము పరమాత్మయందే యుంచియుంచుట. శ్రద్ధయనఁగా, గురువునందును, వేదమునందును, శాస్త్రములయందును విశ్వాసముంచుట. ముముక్షత్వమనఁగా;— తాపత్రయముచేఁ గాల్పఁబడిన జీవుఁడు తత్పరిహారమైన సుఖమనెడి తాపోపశమనము (శాంతి) ఎప్పుడు గలుగునోయని నిరంతరము చింతించు చుండుట. శ్రుతి;— అధీహి భగవన్ బ్రహ్మ విద్యాం వరిష్ఠాం సదా సద్భి స్సేవ్యమానాం నిగూఢామ్, యయాఽచిరా త్సర్వపాపం వ్యపోహ్య పరాత్పరం పురుష ముపైతివిద్వాన్॥ అనఁగా, ఓ భగవంతుఁడా! శ్రేష్ఠమైనదియును, సదాసత్పురుషులచే నుపాసింపఁదగినదియును, రహస్యమైనదియును, దేనివలన జ్ఞానియైనవాఁడు. శీఘ్రముగా సకలపాపములనుఁ బోఁగొట్టుకొన్నవాఁడై శ్రేష్ఠమునకంటే శ్రేష్ఠమైన పురుషుని (పరమాత్ముని) బొందునో అట్టిదియును అగు బ్రహ్మవిద్య నుపదేశించవలెనని యడిగెను. శ్రుతి;— తస్మైస హోవాచ పితామహశ్చ శ్రద్ధాభక్తి ధ్యానయోగా దవేహి, న కర్మణా నప్రజయా ధనేన, త్యాగే నైకే అమృత త్వమానశుః॥ అని కైవల్యోపనిషత్తు రీతిగా, నశ్వలాయనులకు బ్రహ్మదేవుఁడు చెప్పుచున్నాఁడు. (ఓయి అశ్వలాయనుఁడా! నీవు) శ్రద్ధ, భక్తి, ధ్యానము, యోగము, అనువీనిచేఁ దెలియవలెను. కర్మముచేతను, పుత్రాదుల చేతను, ధనముచేతను, మోక్షము సిద్ధించదు. సన్యాసమొక్కటిదానిచేతనే (విద్వాంసులు=జ్ఞానులు) అమృత తత్వమును (మోక్షమును) బొందిరి.

ఇట్టిదను శ్రద్ధచేభక్తియు, భక్తిచే ధ్యానమును, ధ్యానముచే యోగ ము, గల్గునని యెఱుఁగునది. శ్రద్ధాభక్తి ధ్యానములకంటె యోగ ము చిత్తవృత్తి నిరోధించును. కావున దానిచే సాధింప వలయును. యోగములు రెండువిధములు. ఏమనిన, కర్మయోగము, జ్ఞానయోగ ము, అందుకర్మయోగము లేవేవి? యమ, నియమ, ఆసన, ప్రా ణాయామ, ప్రత్యాహార, ధ్యానధారణ సమాధులనెడి యష్టాంగయోగ ములు. యిందుకు, క॥ అష్టాంగ యోగసాధన కష్టంబుల కోర్చితన్ను గనలేఁడు గదా। చేష్టలు విడువని జీవికి కష్టంబగు పుట్టుచావు గతియ గువేమా॥ ఇఁక జ్ఞానయోగమనఁగా, తే॥ ప్రత్యగాత్మ స్వరూపుఁడై పరఁగునతను। రమణ పరమాత్ముఁడైన శ్రీరామునకును। సరవ రసై క్యాను సంధాన సరణియెద్ది। యదియ యోగంబు సదుపాయ మాంజ నేయ॥ యోగశబ్దమున వ్యుత్పత్త్యర్థ మేమనిన, ఉజ్యతే ఇతియోగః॥ అనఁగా నైక్యమునుమా? అనఁగా దేనిదేనికైక్యము అనఁగా జీవాత్మ కును పరమాత్మకును,నైక్యము సహజమయ్యేయున్నది. దీనినే భక్తియ నిఁ జెప్పఁబడును. శ్రుతి;—మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ। స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే॥ తక్కినవి భక్తిమార్గంబులు గాఁజాలవు. ప్రస్తుతపు నవనాగరీకులకు భక్త్యనఁగా నేమో యారహ స్యమును దెలియలేరు. నిజమైన భక్తిభావములేక నెందఱో చెడిపోయి నారు. సీ॥ గాయక రావణాసురునికన్న ధనాఢ్యులులేరు భూమిలో। మాయలయందు సర్వజ్ఞున మంత్రములందును ధైర్యమందునుం। బ్రా యము నందునుం బలపరాక్రమందును భక్తియందునుం। గాయము నమగా తుదకు కాలముఁజెల్లిన యంతనేహతుం। డాయెను కాశిహ స్తి యమరార్చిత సాంబశివా మహాప్రభో॥ మఱియును, సీ॥ నీమము బుట్టి రావణుఁడు నిత్యము భోజన కాలమందుహా। కోమలి సన్ను తాం ధ్రి నవకోటికి సర్తుల పూజచేసిర। తామణి యేమిమోక్ష సిరిసంపద నొంది తరించువేగ శ్రీ। రాములచేతఁ జచ్చె త్రిపురాంతక జాహ్నవు

భక్తియే యిదా। భూమిని శ్రీకాళహస్తి భువనేశ్వర సాంబశివా మహాత్మ భావ [illegible] భక్తిలే నటువంటివాఁడే చెడిపోయినాఁడు. యింక మన సామర్థ్యంబేముండును? ఓ చదువరులారా! వింటిరే. క॥ భక్తికి మూలము జ్ఞానము। రక్తిఁగ గురుచెంతఁజేరి రక్షించునంతట। యుక్తిగ నెఱ్ఱై లోఁచును। ముక్తికి నిలయంపుదారి మునుకొనువేమా॥ అని యున్నది. అయితే దొంగవేదాంతుల కెంతఁజెప్పినను వినఁజాలరు. లోకమందున భక్తి ముఖ్యమైనదేది? అనఁగా జ్ఞానమే ప్రాధాన్యమైనది. జ్ఞానమనఁగా తన్నుఁదా దెలిసికొనుటని భావము. వేదశాస్త్రపురాణేతిహాసములు చదివి, యర్థము చెప్పుట జ్ఞానము గాదుసుమా? అదియే యనుభవము గాఁజాలదు. ప్రకృతి ద్వయాతీతమే యనుభవమైనది. ఉపాధిద్వయరహితమే అనుభవము. తక్కినది యనుభవము గాదు. ఇది ముమ్మాటికిని జ్ఞాపక ముంచుకొనఁదగిన యంశమైయున్నది. దొంగ వేదాంతులమాట కాకులకూతలు, లేక కుక్కకూతలు, వారిమాటలు నమ్మవలదు. దేహత్రయము మీరినదే యనుభవము. తక్కిన దెంతమాత్ర మనుభవముఁ గాఁజాలదు. కొందఱంతయును శూన్యమనిన్ని, మహాశూన్యమనిన్ని, వట్టి మాటలచేఁ దృప్తినొందుదురు. అందుచే నట్లనెవరు. ఆలాగున శబ్దములయితే నన్నారుగాని బ్రహ్మానుభవ మెక్కడనుండి వచ్చును? అయితే నిందుకొక చక్కని పద్యంబు వ్రాయఁబడుచున్నది. దాని ధర్మమర్మమును గ్రహింపవలయును. ఏమనిన, ఆ॥ తానుపుట్టుచోటుఁ దాఁజూచి పలికెనా। తాను బుద్ధిలేరుఁగు ధరణిలోన। తానుపుట్టుచోటు తత్త్వంబుతలపోయ॥ వి॥ అనఁగా నెట్టువంటివానికైనను తన్నుఁదా దెలిసితే తనబుద్ధి తక్షణము కుదురుతుంది. అందుకేమి సందేహములేదు. అయితే నీదేహ మెన్ని తత్త్వంబులు గలిసి నిర్మాణంబైనదో విచారించి చూతుమా? మొదట నీ దేహము పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణంబులు, పంచకర్తలు, పంచ

బ్రహ్మలు, నాలుగవస్థలు, త్రిస్థానములు, అవస్థాత్రయము, త్రిశరీరములు, పంచకోశములు, మొదలగున వన్నియును గలిసి మానవదేహంబాయెను. ఈ యన్నితత్త్వములు గలిసి జీవుఁడయ్యెను. ఒక బండియున్నది. ఆ బండియొక్క నానాభాగములు వేఱువేఱుగాదీసి చూచిన యెడల నేమియుండునో విచారించవలెను. ఈమానవదేహ మట్లు విడివిడిగాచేసి చూచితే నదేయుండును. అప్పుడు జీవుఁడేదీ? ఆ॥ ఏమిగాని దాని నెఱుఁగుట లక్ష్యంబు । సాముఁజేసినట్లు సాధ్యపరచి । నీమనిష్ఠవదలి నిర్గుణమందరా । విశ్వదాభిరామ యిదియు వినురవేమ॥ ఈ ప్రకారముగానే మఱొక యుదాహరణము వ్రాయఁబడుచున్నది. ఏమనిన, యొక గృహమున్నది. ఆ గృహముయొక్క ప్రతిభాగమును వేఱువేఱుగా చేసితే నేముండునో గ్రహించవలెను. ఇందుకు శ్రీమహాయోగపురుషుఁడగు శ్రీ వేమనార్యుని స్వానుభవమును విచారింతము. ఆ॥ ఒక్కయింటిలోన పెక్కుకుండలనిల్పి । వన్నెచున్నెరూపు లలరుచుండు । అదియుదొలఁగనేని యాయిల్లుబయలవును । విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ ఓ చదువరులారా! మఱొక యుదాహరణము వ్రాయఁబడుచున్నది. సావధానముగా వినఁగోరెదను. ఏమనిన, ఆ॥ ఆలు మగఁడు సుతులు నందఱిలోనాత్మ । మేలుగాను నుండి మెఱయుచుండు । వేఱువేఱుగాను వెలసె రూపంబులై । భూతగణములెల్ల భువినివేమా॥ ఒక ముత్యాలహారమునందు గల ముత్యంబులందంట నొక్కసూత్రంబె వ్యాపించి యుండునట్లు సకల జీవజంతువుల హృదయంబున పరమాత్ముఁ డొక్కఁడే వ్యాపించి యున్నాఁడు గాన, యట్టి పరమాత్మయే మహాసూత్రము, మహా యజ్ఞోపవీతము, నిజమైన జ్ఞాన జంధ్యము లనఁబడును. శ్రుతి;—ఏకమేవా ద్వితీయం బ్రహ్మ తస్మిన్ మరు శు క్తికా స్థాణు స్ఫటికాదౌ । జలకాస్య పరుష రేఖాదివ ల్లోహిత శుక్ల కృష్ణ గుణమయీ । గుణసామ్యా నిర్వాచ్యా మూల ప్రకృతి రాసీత్॥ అనెడి పైంగలో పనిషత్తురీతిగా, శుక్తియందు తోఁ

చిన రజతమురీతిగాను, యెండమావులందు తోఁచినజలము రీతిగాను, స్థాణువునందుతోఁచిన పురుషునిరీతిగాను, స్ఫటికమునందుతోఁచిన రేఖలురీతిగాను, యఖండ సచ్చిదానంద పరబ్రహ్మమునందు తనకు తానే తోఁచినట్టి బుద్ధిరూపమున మహా మాయాశక్తియే ప్రకృతియనఁబడును. అది యచేతనమైనది, జడపదార్థంబైనది. అట్లు జడపదార్థముగా నుండినను పరబ్రహ్మముయొక్క సన్నిధానమం దుండుటవలన నా పరబ్రహ్మంబు రీతిగా జ్ఞానస్వరూపమైనదిగా చేతనపదార్థముగా తోఁచుచుండును. ఆ ప్రకృతి నానా విచిత్రములగు రూపనామములుగల యీ జగత్తును సృష్టించుటయందు సామర్థ్యము గలిగినది. ఆ ప్రకృతి సత్వరాజస్తమములనెడి మూఁడు గుణములు గలిగినది. ఆ ప్రకృతియే యీ చరాచరాత్మకమగు మహాజగత్తును సృష్టించెను. శ్లో॥ ప్రకర్షేణ క్రియతే జగదారంభ మనయేతి ప్రకృతిః। అనునట్లు జగత్తు సృష్టి దేనిచే నారంభముఁ జేయఁబడుచుండునో దానిని ప్రకృతి యనఁబడును. ఆ మూలప్రకృతి యెఱుపు, నలుపు, తెలుపు, యను మూడు వర్ణంబులతోఁడ మండల మూఁడురూపులై మూఁడు శక్తులాయెను. తెలుపు వర్ణమే మాయాశక్తి, యెఱుపు యవిద్యాశక్తి, నలుపు ఆవరణ విక్షేప శక్తులాయెను. ఆవరణ శక్తియనఁగా, సుషుప్త్యవస్థ యనఁబడును. విక్షేపశక్తి, స్వప్నావస్థ మాయకు ఆవరణశక్తి, విక్షేపశక్తి యని రెండు శక్తులు గలవు. అందు మొదటిది ఆవరణశక్తి జీవులకు ఆత్మజ్ఞానము గప్పును. రెండవది విక్షేపశక్తి యీ నానావిధ భేదప్రపంచముఁ దోఁపించుచుండును. ఇందుకు తగిన శ్లో॥ రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయాసమాచ్ఛాదనాత్ । సన్మాత్రః కరణోప సంహారణతో యోఽభూత్సుషుప్తః పుమాన్ । ప్రాగస్వాప్సమితి ప్రబోధ సమయే యః ప్రత్యభిజ్ఞాయతే । తస్మైశ్రీ గురుమూర్తయేనమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ అనిగలదు. ఏయాత్మ సుషుప్తియందు విశేష జ్ఞానములకుఁ గారణములయిన కరణములు ఉపసంహృతము లగుటవల

న సత్తామాత్రస్వరూపుఁడై స్ఫురించుచున్నాఁడో అట్టి మాయా వరణము గల్గుటవలన ముక్తుఁడుగాఁడు. కాఁబట్టి రాహుగ్రస్తమైన సూర్యుఁడునుఁ జంద్రుఁడునుఁ బోలె స్పష్టముఁగాఁగాక మసకఁగాఁ దె లియఁబడుచున్నాఁడో, సూర్యుఁడునుఁ జంద్రుఁడును గ్రహణంబునకు ముందునుఁ బిమ్మట నుండుటవలన గ్రహణమప్పుడును, జక్కఁగాఁగనఁ బడక పోయిన నున్నారని దెలియునట్లు, పరమాత్మ మాయావరణంబు వలన సుషుప్తియందును స్పష్టముఁగాఁ దెలియకున్నను సుషుప్తికి ము న్నును బిమ్మట నుండుటవలన నప్పుడు నున్నాఁడని మాత్రము నిశ్చ యింపఁబడుచున్నాఁడో, మఱియు "మున్ను నిదురించితిని, యిప్పుడు మేలుకొని యున్నారు" అను ప్రత్యభిజ్ఞవలన జాగ్రదవస్థయందున్న యే యాత్మ జాగరితమునందున్నట్లే సుషుప్తియందు నున్నాఁడని స్పష్టముగా దెలియఁబడుచున్నాఁడో, భక్తులకు జ్ఞానోపదేశార్థము గురుమూర్తిగా నవతరించినట్టి శ్రీ దక్షిణామూర్తికి నమస్కారంబని తాత్పర్యము సు మా? లోకంబున సకలవేదాంతశాస్త్రంబులును నిద్రావస్థయనే యకాల మృత్యువును దాఁటుటకై నిర్ణయింపఁబడి యున్నది. గాని, యుదర నిమిత్తం బహుకృత్యవేషము నిమిత్తము గాదు సుమా? ఓ చదువరు లారా! నిజముగా నిద్దురను దాఁటలేని మొద్దు వెదవ జన్మమెందుకు వృథా? ప్రస్థానత్రయ వేద్యుఁడవస్థాత్రయ సాక్షియని సీతారామాంజ నేయ సంవాదంబులో నున్నది గదా? లోకంబున రెండు తరహాలుగా ప్రస్థాన త్రయంబు లున్నవి. బాహ్యప్రస్థాన త్రయంబులనిన్ని యంతర ప్రస్థాన త్రయంబులనిన్ని గలవు. బాహ్యప్రస్థాన త్రయంబు లేవియ నఁగా నుపనిషద్భాష్యము, గీతాభాష్యము, సూత్రభాష్యము, అని త్రివిధంబులు అంతర ప్రస్థాన త్రయంబులేవనఁగా, జాగ్రత్స్వప్నసుషుప్తు లని త్రివిధములు గలవు. అయితేను. ఆ॥ నిద్రలోను నిద్ర నిజముగా దెలిసితే । భద్రమగును విద్య బ్రహ్మవిద్య । నిద్ర దెలియువాఁడు నిజమైన యోగిరా॥ వి॥ ఓ చదువరులారా! యిది వింటిరే! వేమనిన

సుషుప్తిని దాటినవాఁడే బ్రహ్మవిద్య కధికారి తక్కిన తెలియని వారలు పనికిరాలరు సుమా? సకలమైన యోగములు, భక్తులు, కర్మములు, జ్ఞానము లన్నియును నిద్దుర దాఁటుటకొఱకేను సుమా? నిద్రకు వ్యుత్పత్త్యర్థ మనఁగా నేమో దెలిసియున్నదా? అయితే నిదిగో నోచమవరులారా! చెవియొగ్గి వినుము చెప్పుచున్నాను. "నిశ్శేషం ద్రావఇతి నాశయతీతి నిద్రః" అనియున్నది. అర్థమేమన, మిగత లేకుండ నాలుకమీఁదను తడిలేకుండ నింకిపోవు టని భావము. నిద్ర మరణము, మూర్ఛ, సమాధు లేక ప్రకారంబుగానే యుండును. మరణమైన తరువాత నుచ్ఛ్వాస నిశ్వాసంబు లుండవుగాని, తక్కిన దంతా సమంబే సుమా? నిద్రావస్థయందు నోటిలోనుండి హంసరాకపోకలుండవు నాశికమునుండి వచ్చుచుపోవుచుండును ఆ కారణముచేత ప్రొద్దున్న లేచడముతోఁటి నోరు కంపుఁగొట్టుచుండును. ఇట్టి నిద్రావస్థను దాఁటినవాఁ డర్జునుఁడకు గుడాకేశుఁడని నామధేయము గలదు సుమా? అర్జునుఁడనఁగా నాశనముగాని వాఁడని శబ్దార్థముఁ దేలినది. ఇక్కడనే యొక రహస్యమైన దున్నది. అదేమనఁగా, శ్లో॥ (శ్రీభగవానువాచ) ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్ ! యః ప్రయాతిత్యజేం దేహం సయాతి పరమాంగతిమ్॥ అనియున్నది. అనఁగా శ్రీకృష్ణమూర్తివారు యర్జునునితోఁ జెప్పుచున్నారు. ఏమనఁగా? ఓ యర్జునుఁడా! ఏది యొక్కటే యయి (అద్వితీయమై) నాశములేనిదై బ్రహ్మస్వరూపమైనదో యట్టి ప్రణవము నుచ్చరించుచు యంత్యకాలంబున నన్ను స్మరణచేయుచు నెవ్వఁడు దేహంబునువిడుచునో వాఁడు పరమగతినిఁ బొందును. అనఁగా దీని రహస్యమేమి? ఇందుకు నీ లోకంబున బహుజనుల యభిప్రాయంబేమనఁగా? స్వకర్మ సూత్రంబుఁ దెగిపోయిన తరువాత నీ దేహంబు నాశనమొందును. సరే నంగతి యందరును దెలిసిన యంశమే అయితే, శ్లో॥ ప్రాణప్రయాణ సమయే

కఫవాత పిత్తైః కంఠావరోధనమ్ విధౌస్మరణంకుతస్తే" అని శ్రీ శాంకర సభలో నావిహ్వాత్రుండు ప్రతిజ్ఞచేసి వక్కాణించి యున్నారు. అనఁగా, ఆ॥ కఫముమీఱి మఱియుఁగనులు మూఁతలుపడి । బుద్ధి తప్పిచాలఁ బుడమినబడుచు । వేళలందు నిన్ను వెదకుట గాదొకో॥ వి॥ నిజముగా ప్రాణముఁ బోవునప్పుడు కఫవాత పిత్తములు గొంతుకలో దట్టముగా నల్లుకొనియుండు. మఱియు సుషుప్తివలె ప్రపంచము మైమఱచి యుండును గదా? అట్టి సమయములో స్మరణ యెటుల జరుఁగును? అంత్యకాల మనఁగా, స్థూలదేహంబు విడిచి సూక్ష్మదేహము లేక లింగదేహంబుతో సుషుప్తికి పోవుసమయమందు సద్గురుండుపదేశము ప్రకారంబు జ్ఞాపకముంచుకొని భగవంతుని స్మరించితే నాయన యందైక్యం బగునని దోఁచుచున్నది. అనఁగా నంతరచిత్సమాధి యోగసాధకము కొంచెము గావలసి యుండును. ఇంకా నిది యభ్యాస యోగంబని పేరుసుమా? మఱియు నేరోజునచేసిన పాపముయారోజుననే పోవుచున్నది. ఇంకా తనకు పాపమనఁగానేమి? శ్లో॥ దేహాహమితి సంకల్పో మహాపాప మితిస్ఫుటమ్॥ అనియు గలదు. అనఁగా నీదేహేంద్రియాదులే తాననుకొనుటే మహాము పాపమనఁబడును. పాపమనఁగా తన దుఃఖమే శ్రీ వేమనార్యుఁడిట్లని యున్నాడు. ఏమనిన, "పాప మనఁగా పరదేశమునలేదు తనదుకర్మములను దగిలియుండు" నని యున్నది. అనఁగా నీ జడంబులగు దేహేంద్రియ ప్రాణాదులే తాననెడి దేహాత్మబుద్ధికే పాపమని పేరు. ఇంతకంటే నధిక పాపము మఱేమియు లేదు సుమా? సంధ్యావందనములో నే దినముఁజేసిన పాపమాదినముననే పోవుచుండునని జెప్పఁబడి యున్నది. అదేమనఁగా "యద్రాత్రియా త్కురుతేపాపం తద్రాత్రియా త్ప్రతిముచ్యతే" అనియున్నది. గనుక నేరోజుపాపం మారోజుననే విమోచనమై పోవుచుండును. శ్రుతి;— స్వప్నేతు జీవ స్సుఖదుఃఖ భోక్తా స్వమాయయా కల్పితవిశ్వలోకే । సుషుప్తికాలే సకలే విలీనే తమోభిభూత స్సుఖరూపమేతి॥

దీని తాత్పర్య మేమనిన, మజల జన్మాంతర కర్మసంబంధమువలన నా జీవుఁడే (దుఃఖము లేక నజ్ఞానము) మేల్కని మఱల సుషుప్తినిఁ బొందుచున్నాఁడు. స్థూల సూక్ష్మ కారణములను త్రివిధ దేహములం దును క్రీడించుచుండు జీవుఁడెవ్వఁడో, వాని యందుండి విచిత్రంబైన సర్వంబును (ప్రంచంబంతయు) కలుఁగుచున్నది. శ్రుతి;— ఆధార మానంద మఖండ బోధం యస్మిన్ లయంయాతి పురత్రయంచ॥ అనఁగా? సర్వమున కాధారముగను, ఆనందముగను, అఖండజ్ఞానము గ నుండునట్టి వానియందు (పరమాత్మయందు) త్రివిధదేహంబులును లయమొందుచున్నవి. తిరిగి వీనియందుండి ప్రాణము, మనస్సు, సకలేంద్రియంబులు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, సర్వమును ధరించియుండుభూమి ఇవి కలుగుచున్నవి. శ్లో॥ మ య్యేవ సకలం జాతం మయిసర్వం ప్రతిష్ఠితమ్ । మయిసర్వం లయంయాతి తద్బ్రహ్మా ద్వయమస్మ్యహమ్॥ అని కైవల్యోపనిషత్తు రీతిగా నాయందుండియే సర్వమును లయమగుచున్నది. అట్టి యద్వై తమైన బ్రహ్మము నేనే సుమా? అంతా నందులోనుండి వచ్చుచుం డును. తిరిగి నందులోనికే లయమగుచుండును. తే॥ ఏఱుక మఱుపు లు గానిది యెఱుఁగలేరు । పరమ పరిపూర్ణసుఖమూని బట్టలేరు। ఉర ము చెదరని గుఱిఁగని యుండలేరు । విమలగుణ రాజయోగీంద్ర వేమ నార్య॥ ప్రతిరోజు నీ లాగుననే రాకపోకలు జరుగుచున్నవి. దొంగవే దాంతులు సుషుప్తినిఁ దాఁటలేరు. లోకంబున కొందఱు క్షేమమా? యని యడిగెదరు. అది సరిగాదు. మఱేదియనఁగా, ఆ॥ కానరాని బయలు గనుటయే క్షేమంబు । మేనుమఱచి నిద్ర మేలఁగినట్లు । తా నుతానుఁగాను తలఁపుమఱపుదాఁటు॥ వి॥ తే॥ సగుణ నిర్గుణ మని యెడి సంశయంబు । పరమ గురునాజ్ఞ చేఁగాక పట్టువిడదు । అగణితం బుగ మదిలోన నందవలెను । విమలగుణ రాజయోగీంద్ర వేమనార్య॥ శిష్య ఉవాచ శ్లో॥ నాన్య వదామి నశృణోమిన చింతయామి । నాన్యం

న్మతాము నఖజాము నచాశ్రయామి। భక్త్యా త్వదీయ చరణాంబుజ యుగళే। శ్రీ శ్రీనివాస పురుషోత్తమ దేహి దాస్యమ్॥ అని శ్రీ భాగవద్గీతలో నున్నది. దీని తాత్పర్యమేమనిన, నీలోకమందు నేమియును నేమిలేదుగాని, భక్తి చాలును. భక్తియనఁగా స్వస్వరూపాను సంధానము. అదే యద్వైతముసుమా! "సృష్టేః పురానామరూప వివర్జితం జగత్, సదేవ సోమ్య ఇదమగ్రాసీత్, బ్రహ్మమాత్ర మసన్నహి, నేహనానాస్తి కించన, అతోఽన్యత్ సర్వం మృషా॥" అని యున్నది. ఈలోకంబులో నన్నిఁటికన్న తన యాత్మయే తనకు మిక్కిలి ప్రీతిగా నుండును. తక్కిన వన్నియు జడపదార్థములు మొదటను ధనమధికము, తరువాత పుత్రుఁడధికము, తరువాత తనదేహమెక్కువ, తరువాత నింద్రియంబులు, తరువాత ప్రాణమెక్కువ, తనయాత్మే తనకెక్కువ సుమా! తనలోనే సకలంబు జూతము సుమా! సకలంబును సుషుప్తియందు జడపదార్థంబులై పోయినవి. మఱియు నిద్రావస్థయందు నా ఈశ్వరరూపియగు నాత్మయే నామరూప రహితుఁడుగా నున్నాఁడుగాన నవ్యాకృతుఁ డనఁబడుచున్నాఁడు. శ్లో॥ నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం। నమంత్రం నతీర్థం నవేదాన యజ్ఞాః। అహం భోజనంనైవ భోజ్యం నభోక్తా। చిదానందరూపః శివోఽహం శివోఽహం॥ అనఁగా, పుణ్యము నేను కాను, పాపము నేను కాను, దుఃఖము నేను కాను, మంత్రము నేనుకాను, తీర్థము నేనుకాను, వేదమును నేనుకాను, యజ్ఞములు కాను, భోజనము కాను, భోజ్యపదార్థము కాను, భోక్తను కాను, ఇఁకనేమనఁగా, చిదానంద రూపుఁడైన శివుఁడే నేను. నేనే శివుఁడను. శ్లో॥ నమృత్యుర్నశంకా నమేజాతిభేదా। పితానైవ మే నైవ మాతానజన్మ। నబంధుర్నమిత్రం గురుర్నైవశిష్య। చిదానందరూపః శివోఽహం శివోఽహం॥ అనఁగా, నాకు మృత్యువు లేదు, భయము లేదు, నాకు జాతిభేదములు లేవు, తండ్రి లేదు, తల్లి లేదు, జన్మము లేదు, బంధువుఁడు లేఁడు, మిత్రుఁడు లేఁడు, గురువు లేఁడు,

శిష్యుండులేండు, నేను చిదానంద రూపుండైన శివుండను, శివుండేనేను. మఱియును, శ్లో॥ అహం నిర్వికల్పో నిరాకారరూపీ। విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం। నచాసమ్మతం నైవముక్తిర్వచోభిః। చ్చిదానందరూప శ్శివోహంశివోహం॥ అనియున్నది. అనంగా, నేను నిర్వికల్పుండను, నిరాకారుండను, నిర్విశేషుండను, సర్వత్ర వ్యాపించువాండను, సర్వేంద్రియములకు ప్రభువును, బంధము, ముక్తి, భీతి, యివి నేను కాను, జ్ఞానానంద స్వరూపుండైన పరమేశ్వరుండను, ఇందుకు సమానమైనది, శ్లో॥ నాహం దేహో నేంద్రియాణ్యంతరంగం నాహంకారః ప్రాణవర్గో నబుద్ధిః। దారాపత్య క్షేత్రవృత్తాదిదూరస్సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివోహమ్॥ అనంగా, ప్రత్యగాత్మనైన సర్వేశ్వరుండైన నేను దేహముగాను, ఇంద్రియములుగాను, యంతరంగములుగాను, క్షేత్రములు వృత్తులు మొదలైన వానికి దూరమునసనుండి నిత్యుండనై సాక్షిభూతుండనై యున్నవాండను, అహంకారముగాను, పంచవాయువులు బుద్ధిగాను, దారాపుత్రాదులుగాను, ఇరువదియైదు తత్త్వములుగాక వాని సాక్షిభూతుండనైన పరమాత్మ తానేయని, సోహంబనెడి స్మరణ చేయుచున్నాండని భావమునుమా? సర్వకాలల సర్వావస్థలయందు నీప్రకారంబుగా స్మరణ చేయుచుండవలయును. పరమార్థతత్త్వ రహస్యము, మహాంధకారమునకంటె నావల నున్నట్టి వానినిగాను, పాతాళలోకము మొదలు సత్యలోకపర్యంతము పదునాల్గు లోకములుగలది బ్రహ్మాండము. దాని తరువాత మహాంధకారము. ఆ యంధకారము గడచిన వెనుక స్వయం జ్యోతిర్మయమగు లోకము. అదే వైకుంఠ లోకమందురు. వైకుంఠమనంగా నశించనది, కుంఠమనంగా నశించునది. యిట్లులనే చ్యుతము, అచ్యుతము, మృతము, అమృతము, మరము, అమరము, శ్వత్థము, అశ్వత్థము, మొదలగునవి. ఇట్టు సుషుప్తిలో నుండునప్పుడు ప్రారబ్ధం బెవ్వరి కుంటునో విచారించుము. శ్లో॥ ననిరోధో నచోత్పత్తిర్నబద్ధో నచసాధకః। నముముు

క్షుః ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥ అనియున్నది. దీని తాత్ప ర్య మేమనిన, జనన మరణములు లేవు, బద్ధుఁడు, సాధకుఁడు, ముము క్షువు, ముక్తుఁడు, ననుభేదము వ్యావహారికముగాని పారమార్థికముగా దు, సత్యముగాదు, బ్రహ్మముకన్న నన్యము మిథ్యసుమా? శ్లో॥ అ జాతస్య కుతోనాశః ప్రారబ్ధ మసనిఃకుతః। జ్ఞానే నాజ్ఞాన కార్యస్య సమూలస్య క్షయోయది॥ అనఁగా జ్ఞానముచేత నజ్ఞానకార్యము సమూ లముగా క్షయించునేని, పుట్టని వానికి నాశనమెక్కడిది? అసలే లేని వస్తువునకుఁ బ్రారబ్ధ మెక్కడిది? శరీరమునకుఁ బ్రారబ్ధముఁ గలదనుట యు భ్రమయే నిక్కముగానిదైనను నిక్కమైనదని యెన్నఁబడిన యీ దేహానకునికి యెక్కడిది? ఉనికిలేని వస్తువునకుఁ బుట్టుక యెక్కడిది? లేదు. పరబ్రహ్మము సత్యస్వరూపమును, జ్ఞానస్వరూపమును, నిత్య మైనదియు, యానందస్వరూపమును, కర్మరహితమైనదియు, యేకమైన దియు, రెండవది లేనిదయు, గావున నాబ్రహ్మమునందు నానాతత్త్వము (అనేకములుగానుండుట) లేదు. "బ్రహ్మమాత్ర మసన్నహి నేహానా నాస్తి కించన। అతోన్యత్ సకలం మృషా జ్ఞాతేద్వైతం నవిద్యతే॥" బ్రహ్మ మొక్కటే నున్నదిగాని సత్యముగా మాయ లేనేలేదు. మా యాకార్యమైన జగత్తున్ను లేదు. ఇదే శుద్ధాద్వైతము. దీనిపేరే పర మార్థతత్త్వ రహస్య బోధామృతము. ఇందుకు శ్రుతిప్రమాణ మేమ నఁగా, "దేహత్రయ విహీనత్వా త్కాలత్రయ వివర్జనాత్। జీవత్ర య గుణాభావా త్తాపత్రయ వివర్జనాత్। లోకత్రయ విహీనత్వా త్సరమా త్మేతిశాసనాత్। చిత్తాభావ న్నచింతనీ యం దేహా భావాజ్జలా నచ॥ అనియున్నది. అనఁగా చిత్తములేమివలనను సర్వదృశ్యములు లేమి వలనను, పరమాత్మ చింతించఁబడుటకు శక్యముగానిది. నేతినేతివాక్యం తెలిసినంత దానిని నిషేధిపఁగా నవాఙ్మానస గోచరమై యేది శేషించు నో యదే బ్రహ్మంబునుమా? ఇందుకు శ్రీమచ్ఛంకరాచార్యుల వారి ట్లు చెప్పియున్నారు. ఎటువలెన, శ్లో॥ నిషేధేకృతే నేతినేతీతివాక్యై స

మాధిస్థితానా యదాభాతిపూర్ణం। అవస్థాత్రయాతీతమేకం తురీయం పరం బ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥ అనియున్నది. క॥ నిర్మల సమాధింబూనుక। కర్మలఁ దొలంగించినీలో కదుముచునుండన్। నిర్మోహమైనగుణమగు। ధర్మము పరిపూర్ణమగునుఁ దాకుమువేమా॥ ఓహో చదువరులారా! ఆ॥ ఊపిరున్నయపుడె యుపదేశమందుము। రూపుమాయునపుడు రూఢిగాదు। బావుఁ బైఁ ననేమి బడబాగ్ని మ్రింగునా॥ వి॥ యిందుకు తగినది శ్రుతి;—నహిప్రమాణం జంతూనా ముత్తరక్షణ జీవితం। శ్వాసవేళాయాం యత్కృతం తత్ సదాకురు॥ దీని తాత్పర్యమేమనిన, లోకమునందలి సకల జనులున్ను ఇంకపై క్షణమునందు స్థిరముగా జీవించి యుండగలరని, తలంచుటకు సాధ్యపడదు. ఎప్పుడో ఏవేళనో తమకు తెలియకనే యున్నట్లుండి మరణము ప్రాప్తించి ప్రాణములు లేచిపోవును. కాఁబట్టి, ఈ దేహమున నుచ్ఛ్వాస నిశ్వాసములుండునప్పుడే ప్రతిశ్వాసమున్ను మరణకాలము నందలి అంత్యశ్వాసముగా దలంచి సదా (అహం బ్రహ్మాస్మి) అని బ్రహ్మానుసంధానమే చేయుచుండవలయును. శ్రుతి;— బ్రహ్మణా సహ ముక్తిశ్చ ద్వయదోష రహితం పూర్ణం ద్వంద్వహీనం సదామలం। అంతర్బహిస్సదా వ్యాప్త మానందాతీతమచ్యుతం॥ అని శ్రుతియున్నది. గనుక నున్ను లోకమందు బ్రహ్మతోనే ముక్తి, మఱివకరికి యెంతవారికిని ముక్తిలేదు. ఇదే సిద్ధాంతము, ఇదే యాత్మానాత్మ రహితమైనబోధ. ప్రత్యగాత్మ, పరమాత్మ, సూత్రాత్మలనేవార్త పుట్టనేలేదు. ప్రపంచమెవ్వరికిని దోఁచనేలేదు. యెఱుక మూడు కాలములయందును పరిపూర్ణమందు పుట్టనేలేదు సుమా? ఇదే దృఢము. శ్రుతి;— సర్వద్వంద్వ విరాహిత్యం కింతు మిథ్యాత్మనిశ్చయః। నిశ్చయం వాస్తి సర్వత్ర నాస్తిభావం సదానహి॥ ఈ ప్రకారముగా సిద్ధాంతమైయున్నది. గనుక నెఱుక లేనేలేదు, ఎఱుకన్నా మాయన్నా నొక్కటే. కాలత్రయమందును మాయ లేనేలేదు సుమా? "సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తికించన, సృష్టేఃపురా నామరూప వివర్జితం జగత్ జ్ఞాతేద్వైతం నవిద్యతే॥" ఇందుకు స్వానుభవము చకఁగా చూడండి. జాగ్రత్స్వప్న సుషుప్తిలో స్థూలసూక్ష్మ భోగప్రదంబులగు కర్మము లుండుటచే దేహముండును.

సుషుప్తియందు స్థూలసూక్ష్మ భోగప్రదంబులగు కర్మంబులు లేవుగనుక దేహముండదు. ఇట్లు నొక్క యవస్థలో సంగతి మఱొక యవస్థలోఁ గనఁబడనందున జగత్తు మిథ్యయైపోయినది. అందుకే బ్రహ్మసత్యం జగత్తు మిథ్యయనఁబడును. ఈ బ్రహ్మవిద్య నేర్చుకొంటే నెంతవచ్చును? సంగీతము, బ్రహ్మవిద్య, ధర్మము యివిచూచి నేర్చుకొనెదమంటే వచ్చునవి గావు సుమా? ఆ॥ వీరుఁడైన లేదు విద్యనేర్చిన లేదు। చదువులందు లేదు పటుల లేదు। జన్మఫలమెగాని జపియించినా లేదు॥ వి॥ లోకమందు నెప్పుడు సన్యసించవలెనంటే;—— ఆ॥ వీనులందు వినెడి వేడుక గుఱిఁదాఁటి। పూని ప్రణవరవళిఁ బోరుకొల్పి। స్వానుభవముఁ గోరి సన్యసింపఁగవలె॥ వి॥ అంతేగాని, తలా తోఁక లేకుండా సన్యసించెదరు. అట్టివారందఱును దొంగ సన్న్యాసులు సుమా? ఆలాగుననే యీలోకంబున దొంగ గురువులుఁగూడను గలరు. మహాజాగ్రతగా సంచరించవలయును సుమా?



ఇతి శ్రీ కాశీక్షేత్రనివాసుఁడును, సకలవేదాంతశాస్త్రవిశారదుఁడును, యుపాధిద్వయాతీతుఁడును, ప్రకృతిద్వయారహితుఁడును, పంచకోశవ్యతిరేకుఁడును, నాదబిందుకళాతీతుఁడును, పంచముక్త్యాతీతుండునుయగు శ్రీమత్పరమహంసావధూత దిగంబర స్వాములవారి ప్రియశిష్యుఁడగు, శ్రీమదఖండ గౌతమీతీరంబుననున్న ధవళేశ్వరపురంబను శ్రీరామపాద క్షేత్రంబున నవతరించిన శ్రీ శంకరమంచి లక్ష్మీనృసింహరాజయోగీంద్రులవారి ప్రియశిష్యుఁడగు, శ్రీగంజాంజిల్లా ఋషికుల్యానదీ ప్రాంత్యమందున్న శ్రీ బ్రహ్మపురంబున నవతరించిన శ్రీ తారక బ్రహ్మానుభవియగు, పూడిపెద్ది- సాంబశివ రావుగారిచే రచియింపఁబడిన పరమార్థ తత్త్వ రహస్యార్థబోధిని సర్వం సంపూర్ణము.

